# తీర్పు మీదే

( నాటిక )

31/11-84.



రచన:

యస్. వివేకానంద





వసుంధరా పబ్లికేషన్సు

చిత్తూరు

# తీర్పు మీదే

( నాటిక )





రచన:

యస్. వివేకానంద



వసుంధరా పబ్లికేషన్సు
చిత్తూరు

# ఇందలి పాత్రలు :-

(1) శివశంకర శాస్త్రి : 60 ఏళ్ళు. మెడలో రుద్రాక్ష మాల, ముఖాన విభూతి పట్టెలు – వంటిన చొక్కా వుండదు. డబ్బు దాహం వున్న మనిషి.

(2) రఘు : శాస్త్రిగారి పెద్దకొడుకు. 35 సం॥. చదువు సామాన్యం. ఉన్నవూరిలో చిన్న వుద్యోగం.

(3) రవి : శాస్త్రిగారి రెండవ కొడుకు. 28 సం॥. M. A. పాసైన నిరుద్యోగి. తండ్రిని కాదని ప్రపంచంలో బ్రతకలే ననుకునే బలహీనుడు.

(4) సుశీల : రవి భార్య. 22 సం॥ కాస్తో కూస్తో చదువుకుంది. తల బిరుసుతనం లేదు గాని తెలివి తేటలున్న ఆడది.

(5) రాఘవయ్య : 55 సం॥. సుశీల తండ్రి. బాగా బ్రతికి ఆర్థికంగా చితికి పోయినట్టు కన్పిస్తాడు.

(6) శేషయ్య : 45 సం॥. సుశీల మేనమామ. ఒక కాలు అవుడుగా నడుస్తాడు.

(7) స్వామి : నున్నటి గుండు. సన్నని పిలక. కాషాయ వస్త్రాలు!. నడి వయస్సు!!.

(8) లాయరు : వయస్సెంతైనా వుండచ్చు!. ఎవరైనా కావచ్చు!!.

# రంగస్థలం! — అలంకరణ!! —



స్టేజి కుడివేపుది ప్రవేశద్వారం. దాని ప్రక్కగా మేడమెట్లు అవుపిస్తూంటయ్. ఒక మిడిల్ డోరు. దానికి డోర్ కర్టెను వుంటుంది: ఎడమవేపున మరో ద్వారం. ద్వారానికి ఓ కర్టెను వుంటుంది.

స్టేజిమీద ఓ కోయ్యా కుర్చి మిడిల్ డోరు ముందుగా వుంటుంది. అది ఇల్లు అన్పించేటందుకు అనువుగా మరేమైనా వుంచుకోవచ్చు. అయితే అలా వుంచుకున్న స్టేజి ప్రాపర్టీ నటీనటుల మూమెంట్‌కి అడ్డుగా లేకుండా చూచుకోవటం ప్రధానం. స్టేజి మధ్య భాగానికి ముందుగా ఓ తెర (కర్టెను) ముందుగానే అమర్చుకుని వుండాలి!. ఆ తెరకు పుల్లీస్ ఏర్పాటు చేయబడటం అవసరం!. ఎంచేతంటే ఆ తెరపైకి లాగబడవలసిన అవసరం నాటికలో వుంది. అంటే ఫ్రంట్ డ్రాప్ (కర్టెను)కి ఓ మూడు అడుగుల దూరంలో పైన చెప్పిన కర్టెను అరేంజి చేసుకోవాలి!. క్షణాల మీద ఈ కర్టెను పైకి లాగబడే విధంగా వుంచుకోవటం అవసరం!.

ఎంచేతంటే ... మిడిల్ డ్రాప్ (కర్టెను) ముందు వైపున నాటిక ప్రారంభమౌతుంది. పది నిమిషాల తర్వాత లైట్లు ఆరగానే ఆ కర్టెను పైకి లాగబడటం తర్వాత పూర్తి స్టేజిమీద మిగతా నాటిక ప్రదర్శింపబడటం జరుగుతుంది.

అంతే కాదు...నాటిక చివరి పది నిముషాల సమయం కూడా మిడిల్ కర్టను ముందు భాగంలో జరిగి ముగుస్తుంది.



# తీర్పు మీదే!.

## (నాటిక)



[తెర తొలగుతుంది. అప్పటికి ముందుగా అరేంజి చేసుకున్న మిడిల్ డ్రాప్ మాత్రమే ప్రేక్షకులకు అవుపిస్తూ౦టుంది. స్టేటికి ఎడమవేపు దగ్గఱగా ఓ చెక్క-బోను వుంటుంది. దాని వెనగ్గా ఓ స్త్రీ నిలబడి వుంటుంది. ఆమెమీద (Spot light) స్పాట్ లైటు తప్ప మిగతా స్టేజీ అంతా చీకటి. చీకటిలో కుడి వేపు నుండి తెల్లపేంటు నల్లగౌనుతో లాయరు ప్రవేశం. లాయరు మీద ఏ విధమైన లైటూ అవసరం లేదు. ఎడమవేపు నున్న (wing) వింగులో జడ్జీ వున్నట్టుగా భావించుకోవాలి!. లాయరు ఆ (wing) వింగు వేపు చూస్తూ ... నడుస్తూ మాట్లాడతాడు.]

లాయరు: యువరానర్!. బోనులో వున్న స్త్రీ మీద హత్యా నేరం మోపబడ్డది. ఈ ముద్దాయి నేరస్థురాలు అని రుజువు కాబడటానికి ప్రత్యక్ష సాక్షులెవరూ లేక పోవచ్చు!. కానీ ... ముద్దాయి అనబడే ఈమె హంతకురాలు అని చెప్పటానికి ఆధారాలువున్నాయ్..

సుశీల: (వెర్రిగా అరుస్తూ) లేదు. ... కావాలని నేను చంపలేదు ...

జడ్జి: (కన్పించడు. ఎడమ వేపునుండి వాయిస్ విన్పిస్తుంది.) ఆర్డర్ ...ఆర్డర్! — మిస్టర్ పబ్లిక్ ప్రాసిక్యూటర్!. యు కెన్ ప్రొసీడ్. ...

లాయరు: యు వరానర్!-మనది పవిత్ర భారతదేశం!-హిందూ సాంప్రదాయ ప్రకారం, 'భార్య' కట్టుకున్న 'భర్త'ను గౌరవించటం అనేది అనాదిగావస్తున్న సాంప్రదాయం! — సీత, సావిత్రి - అనసూయ వంటి పతివ్రతామ తల్లులు వుద్భవించిన భారతావని మనది!. కారణాలు ఏవైనా... పరిస్థితి ఎంతటి బలీయమైనదైనా కట్టుకున్న భర్తను భార్య గౌరవించటం... ప్రేమించటం అనేది సాంఘిక పరమైన కట్టుబాటు!. — అటువంటి కట్టుబాట్లకు విరుద్ధంగా ప్రవర్తించటమే కాకుండా... సుశీల అనబడే ఈ ముద్దాయి తాళికట్టిన భర్తనే కత్తితో దారుణంగా పొడిచి, చంపింది!. పాటి మనిషిని... అందునా భర్తను హత్య చేయటమనేది క్షమించరాని నేరం!.

సుశీల: అలాకాదు ... నన్ను చెప్పనివ్వండి... ప్లీజ్. ...

జడ్జి: ఆర్డర్! ... ఆర్డర్!! — చూడమ్మా!... నువ్వు చెప్ప దలచుకున్న దేమిటో తర్వాత చెప్పచ్చు. అంతే గాని ... మధ్యలో అడ్డుగా మాట్లాడకూడదు! — యస్. యు కెన్ ప్రొసీడ్ మిస్టర్ పబ్లిక్ ...ప్రాసిక్యూటర్

లాయరు: యువరానర్! — భర్తను హత్య చేయటానికి ముద్దాయి వుపయోగించిన కత్తిమీద ఆమె చేతి వేలిముద్ర లున్నయ్. ఆ విషయం ఫింగర్ ప్రింట్ నిపుణులు ధృవపర్చటం జరిగింది. — దట్సాల్ యువరానర్!–కాబట్టి I. P. C. 302 క్రింద ముద్దాయి శిక్షార్హురాలు!.

జడ్జీ: ప్రాసిక్యూషన్ వారి కథనం విన్న తరువాత ఈ కేసును వాయిదా వేయటమైనది. [అమ్మాయి మీద Spot light తక్కున ఆరిపోతుంది. అమ్మాయి ఆమెతో పాటు బోను పక్కకు తప్పుకుంటయ్. మిడిల్ డ్రాప్ పైకి లాగబడుతుంది. ఇదంతా క్షణాల్లో జరుగుతుంది. వెంటనే స్టేజిమీద అన్ని లైట్లూ వెలుగుతయ్.]

రఘు: (మేడ మెట్లు దిగివస్తూ) ... నాన్నా... నాన్నా ...

శాస్త్రి: (ఎడమ వేపు ద్వారంలోంచి వస్తూ) ఏరా రఘూ పిలిచావా ? —

రఘు: అవును నాన్నా! అర్జంటుగా నాకు అయిదు వందలు కావాలి!

శాస్త్రి: అంతడబ్బు నా దగ్గ రెక్కడిదీ?! ... అయినా ఎందుకు అంత డబ్బు — ?

రఘు: మన పొలంలో పత్తి చేనుకు చీడ పట్టింది నాన్నా!. ఆ మాట రైతు చెప్తే నమ్మలేదు. తీరా నేవెళ్ళి

చూద్దును గదా పత్తి మొక్కలన్నీ చెడిపోయినట్లు అవుపించింది.

శాస్త్రి: కృష్ణ కృష్ణ! — అలా ఎందుకు తగలడ్డది?

రఘు: అదే ప్రశ్న నేనూ రైతు నడిగేను.

శాస్త్రి: వాడేమన్నాడు?

రఘు: అకాలంలో వానలు కురిసి నందువల్ల అన్నాడు.

శాస్త్రి: మరిప్పు డేమిటి చేయటం?

రఘు: ఏముంది? — క్రిమిసంహారక మందులు కొని వెంటనే మొక్కలు మీద చల్లించకపోతే ... పంట చేతికి రాదు ... మనకు చిల్లిగవ్వ ఆదాయం దక్కదు. అంతే!.

శాస్త్రి: కృష్ణ కృష్ణ! — పత్తి పండించుకుని లక్షలు సంపాదించిన వాళ్ళున్నారు. — మన ప్రారబ్ధ ఖర్మేమో ఇలా వుంది. ...

రఘు: పురుగుల మందు కొనేటందుకే మిమ్మల్ని డబ్బడిగింది.

శాస్త్రి: అవసరం పీకలమీది కొస్తుందని నేనేమైనా కలగన్నానా? ... నా దగ్గరున్నది కాస్తా ... నీ తమ్ముడికిచ్చి పంపేనుగా. ...

రఘు: మరిప్పుడెట్లా?

శాస్త్రి: అదే నేనూ ఆలోచిస్తున్నాను. — ఆ! — ఎవరేనా అప్పిస్తారేమో అడిగి చూడు. వీలు చూచుకుని బాకీ

తీర్చేద్దాం! మనరైతు రామయ్య మాట లెప్పుడూ ఇట్లాగే వుంటయ్ — ఏదీ ముందుగా చెప్పి చావడు!.

రఘు: మనకు పొలం ఎందుకంటే నామాట విన్నావు కాదు.

శాస్త్రి: పోయిం దెట్లాగూ పోయింది!. చివరికి ఈ శాస్త్ర కూడా అమ్ముకుంటే... ముందు ముందు మన మెట్లారా బ్రతికేది? నీకు చూడబోతే సంపాదన తక్కువ ... వాణ్ణి చూద్దామా అంటే వుద్యోగంకోసం ఇంకా ఎక్కే గడప—దిగే గడప!. మధ్య నా చావుకొచ్చింది. (తల పట్టుకుని కుర్చీలో కూర్చుంటాడు.)

రఘు: అది సరే నాన్నా! ... రవి హైద్రాబాద్ నుండి ఎప్పు డొస్తానని చెప్పేడు?.

శాస్త్రి: మరో క్షణంలో ఆయనగారూ వూడి పడతాడు — కృష్ణ కృష్ణ!! — ఇటు ఇంటి ఖర్చు... అటు నీ తమ్ముడి ఇంటర్వ్యూల ఖర్చుకూ డబ్బు సర్దలేక నాపనై పోతోంది. ఒరే రఘూ ... ఓ పనిచేస్తే? — అవసరం మనది కనుక తప్పదు గురి! — మీ మామగారి దగ్గర కెళ్ళి ఓ వెయ్యి రూపాయలు పట్టుకురా! — ఏం? —

రఘు: ఛీ ఛీ! - నేనా?! — వాళ్ళింటికా!? — ఏం ముఖం పెట్టుకు వెళ్ళను?... నా భార్య చచ్చిపోయాక వాళ్ళింటితో నాకున్న అనుబంధం తీరిపోయింది.

శాస్త్రి: అట్లా అనుకుంటే ఎట్లారా? — కృష్ణ కృష్ణ! — పెళ్ళాం చచ్చిపోయినంత మాత్రాన మామగారు నీకు

కాకుండా పోతాడా? అట్లా భావించటం కేవలం నీ వెర్రితనం. ...

రఘు: కట్టుకున్న భార్యకి సరైన మందు కూడా ఇప్పించలేదని అది బ్రతికినంతకాలం వాళ్ళచేత అన్పించుకున్న రెప్పపాటు మాటలు చాలు!!

శాస్త్రి: చూడు రఘూ! ... మనుష్యులు దూరమైనా ... వారి ఐశ్వర్యంతోను ... డబ్బుతోనూ ముడి పడివున్న అనుబంధం ఎలా దూరమౌతుంది నువ్వే ఆలోచించు!. ఇక్కడే నువ్వు కొంచెం లౌక్యం ప్రదర్శించటం నేర్చుకోవాలి. ,.. కృష్ణ కృష్ణ! — మీ మామగారు నిన్ను చీదరించుకున్నా...ఆయనగారి అండదండలు నీకెంతైనా అవసరం!. ఏంచేస్తాం అంటావేమో? ... ఆయనా జీవిత చరమాంకంలో వున్నాడు పాపం! ... ఇవేళో రేపో కన్నుమూస్తే... ఆయనకు అల్లుడివి అయినా కొడుకువైనా నువ్వేగా!

రఘు: అందుకని? ... మన అవసరం కదాని ... మానాభిమానాలు వదులుకుని వెళ్ళి ఆయన్ను ఆశ్రయించమంటావా? వద్దు నాన్నా... వద్దు!! —

శాస్త్రి: రఘూ! నువ్వేదో ఆవేశంలో మాట్లాడుతున్నావ్! — మనిషికి కావలసింది ఆవేశం మాత్రమే కాదు. ఆలోచన కూడా! — గొంతుమీదికొచ్చిన అవసరాన్ని ఎలా తీర్చుకోవటమాని కూడా వివేకంతో

ఆలోచించాలి!. పైగా నీ మామగారికి మాత్రం చచ్చి
పోయిన నీ భార్య తప్ప ఆడపిల్లలుగానీ మగపిల్లలు
గానీ మరెవ్వరూ లేకపోయె! — అలాంటప్పుడు
ఆయన్ను నువ్వు కాదనుకుంటే ఆయనేమై పోతాడు?
...పైగా వృద్ధాప్యంలో అనారోగ్యంతో మంచంలో
వుండె! — ఆయన కాస్తా 'హరీ' అంటే, లక్షన్నర
ఖరీదు చేసే మేడ ..బ్యాంకులో క్యాషు... పదెకరాల
శుక్షేత్రమైన మాగాణి పొలం, నీకే గదా దక్కేది!

రఘు: నా...న్నా! —

శాస్త్రి: అభిమానం మనుష్యులకు తిండి పెట్టదురా అబ్బాయ్!,
నా మాట విని .. నే చెప్పినట్టు చెయ్! — వెళ్ళి...
మంచంలో వున్న నీ మామగార్ని పరామర్శించిరా! -
తెగిపోయిందనుకుంటున్న అనుబంధాన్ని అతికించు
కోవటం మనకే అవసరం!! —

రఘు: ఇన్ని రోజుల తర్వాత మళ్ళీ వాళ్ళ గడప తొక్కితే,
నేను కేవలం డబ్బు గురించే వచ్చానని నలుగురూ
నానా రకాలుగా ఆడిపోసుకుంటారేమో నాన్నా!?,

శాస్త్రి: ఆడిపోసుకునే వాళ్ళెవ్వరూ నిన్ను ఆదుకోరు —
అర్థమైందా?! ... లోకులనుకుంటారని నువ్వు వెళ్ళటం
ఎందుకు మానుకోవాలి? —

సుశీల: (ఓ చేతిలో కాఫీ గ్లాసు మరో చేతిలో మజ్జిగ గ్లాసుతో
ప్రవేశం) మామగారూ! ... కాఫీ తీసుకోండి ...

శాస్త్రి: నాకు కాఫీకి తొందరే మొచ్చింది గాని ... కాలు చెయ్యీ పడిపోయి మంచంలో వున్న నీ అత్తగారి గొంతులో వేళకింత మందు పొయ్. చాలు! — కృష్ణ కృష్ణ!. ఈ కాఫీ వ్యసనం సంసారాలనుకూల్చేస్తోంది. నెలకో వంద రూపాయలు ఈ కాఫీ కోసం ఖర్చవుతోంది. (అయిష్టంగానే కోడలి చేతిలో గ్లాసు అందుకుంటాడు.)

సుశీల: (రఘు దగ్గరగా వెళ్ళి) బావగారూ!... మీకు మజ్జిగ తెచ్చాను. (గ్లాసు అందించింది.)

రఘు: వద్దు వద్దను కుంటూ కాఫీ తాగి ఆరోగ్యం చెడగొట్టు కునేకంటే... రెండు పూటలూ మజ్జిగ తాగితే వంటికి ఆరోగ్యం కూడా వుంటుంది.

శాస్త్రి: చూడు కోడలా! — రేపటినుండీ ... ఇంట్లో అందరికీ కాఫీ ఇవ్వటం మానెయ్యాలి! — తెల్సిందా?!—

రఘు: తమ్ముడు కాఫీ తాగకుండా వుండలేడే మోనాన్నా...

శాస్త్రి: ఆయనగారు కాఫీ తాగకుండా వుండలేదు ... ఈ విడగారేమో వేళకి కాఫీ తయారుచేసి ఇవ్వకుండానూ వుండలేదు.

సుశీల: (మారు మాటాడకుండా ఖాళీ గ్లాసులు అందుకుని ఇంట్లో కెడుతుంది.]

శాస్త్రి: మనం ఎన్ని మాట్లాడినా...నోరు మెదపదు కదా?— కృష్ణ కృష్ణ! — అంచేత ... నే చెప్పింది అర్థమైం

దిగా! పక్క వీధే కాబట్టి వెళ్ళి ఓ సారి మీా మామ గారిని పలుకరించిరా! ... వెడుతూ ఓ డజను పండ్లు తీసుకెళ్ళు. ...

రఘు: అలాగే ...

శాస్త్రి: ఇప్పుడు నువ్వు నాకొడుకు వన్పించుకున్నావ్!. ఇంకా ఆలశ్యం దేనికీ? ... బయల్దేరు ... (రఘును సాగనంపి తానొచ్చి కుర్చీలో కూలబడతాడు.)

[స్వామి ప్రవేశం.]

స్వామి: (వస్తూనే) శివోహం ... శివోహం. ...

శాస్త్రి: (కుర్చీలోంచి తటాలున లేచి ఎదురొచ్చి) స్వామి వారా... రండి... రండి!. ఎన్నాళ్ళకు మీా దర్శన భాగ్యం కల్గింది. ... (సాదరంగా ఆహ్వానించి కుర్చీ చూపిస్తూ) ఆశీనులు కండి స్వామీా! —

స్వామి: సర్వాంతర్యాములం! — దేశం నలుమూలలూ తిరగ వలసిన ధర్మం మాది. (కూర్చుని) ఆఁ!...నీవు... నీ కుటుంబమూ క్షేమమేకదా?!—

శాస్త్రి: ఆఁ ... ఏం కులాసా స్వామి? నాకూ వయస్సు మించి పోయింది. ...

స్వామి: మనిషివి దృఢంగానే అవుపిస్తున్నావు కదా ...

శాస్త్రి: నా విషయం వదిలేయండి స్వామీా ... నా భార్య రోగంతో మంచాన పడ్డది.

స్వామి: పాపం!...అలాగా? ... మరి...మందేదైనా ఇప్పిస్తున్నావా .. డబ్బుకు కక్కుర్తిపడి ఆమెను చావుకు దగ్గర చేస్తున్నావా?. ...

శాస్త్రి: కృష్ణ కృష్ణ!. ఎవరి ఆయుర్దాయానికి ఎవరు కర్తలం స్వామీ?! చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ

స్వామి: (చుట్టూ చూచి) మరి ... నీ బిడ్డలేరి? ...

శాస్త్రి: పెద్దవాడు...అదే...రఘు!... ఇప్పుడే అట్లా బైటికెళ్ళేడు.

స్వామి! అతగాడికి వివాహం చేశావనుకుంటాను ...

శాస్త్రి: కృష్ణకృష్ణ! — వాడి గ్రహచారం మరోవిధంగా తగలబడటంతో కనీసం సంవత్సరమైనా కాపురం చేసిందో లేదో హఠాత్తుగా కన్నుమూసింది కోడలు.

స్వామి: శివ శివా ... అయితే ... పెద్దకోడల్ని సాగనంపేవన్న మాట!... మొత్తానికి ఘుడి కుడివే. ...

శాస్త్రి: ఇంతకూ వాడి ఖర్మ అట్లా కాలింది... అంతే! — ఇటీవలే రెండోవాడు రవి క్కూడా వివాహం జరిపించాను.

స్వామి: శుభం! — ఇంకేం? ...

శాస్త్రి: అప్పటినుండే మాకు కష్టాలు మొదలైనయ్ స్వామీ! 'పెళ్ళి పెళ్ళ' నేసి వాడికేమో మురిపెంగా వుంది గాని ... వుద్యోగం మాత్రం లేదు ఇంతవరకు. — పాతిక

వేలొస్తాయనేసి కట్నం కోసం కక్కుర్తి పడితే ...
చేతిలో ముద్ద నోటికి అందకుండా పోయినట్టుంది
మా పరిస్థితి ..

స్వామి: విచారించకు!. సమయం ఆసన్నమైతే పరిస్థితులు
వాటంతట అవే సర్దుకుంటయ్ ...

శాస్త్రి: అది కాదు స్వామీ... పెళ్ళిలో పదివేలు చేతికిచ్చి
మాయ మాటలు చెప్పి మమ్మల్ని బురుడీపుచ్చి బుట్టలో
వేశాడు వియ్యంకుడు! — తర్వాతేమో ... ఇవ్వ
వలసిన పదిహేను వేల సంగతి మాట్లాడటంలేదు. ...

స్వామి: ఇంత వయస్సొచ్చినా...నీకు డబ్బుమీద వ్యామోహం
పోలేదు కదా?! — శివోహం ... శివోహం ...
ఇంతకూ రెండో కొడుకేడీ ... కన్పించడేం?

శాస్త్రి: వాడు వుద్యోగంకోసమై ఇంటర్వ్యూ కెళ్ళాడు. (ఎడమ
వేపు ద్వారం కేసి చూస్తూ) సుశీలా ... సుశీలా ...
స్వామివారొచ్చేరు. చెంబుతో నీళ్ళు...కాళ్ళు కడిగే
టందుకు పళ్ళెము తీసుకురా! ... ఏమిటో? ... ఈ
కొంపలో అన్నిటికీ నేనొక్కడినే సతమతం కావాల్సి
వస్తోంది! (నిట్టూరుస్తాడు.)

స్వామి: విచారించకు!. బుద్ధీ ఖర్మానుసారిణీ ... (చిద్విలా
సంగా నవ్వేడు.)

సుశీల: (నీళ్ళ చెంబు పళ్ళెంతో వస్తుంది.)

శాస్త్రి: స్వామివారికి నమస్కారం చెయ్యి సుశీలా! — స్వామీ! — నా రెండో కోడలు సుశీల!

స్వామి: (నఖ శిఖ పర్యంతం చూచి) లక్ష్మీ దేవిలా వుంది!.

శాస్త్రి: స్వామీ! ... డబ్బు గురించే నిత్యమూ నాకూ కోడలికీ మధ్య గొడవ!. పెళ్ళయిందే చాలు గదాని మురిసి పోతోంది గాని ... తండ్రి ఇవ్వాల్సిన కట్నం ఇవ్వనందుకు చీమ కుట్టినట్టయినా లేదు. ...

స్వామి; కాలమే సమస్యలను పరిష్కరిస్తుంది శాస్త్రీ ...

శాస్త్రి: సుశీలా!. నీ చేతిలో పళ్ళెం స్వామివారి పాదాల చెంతవుంచి వారి పాదాలు ప్రక్షాళనం చెయ్యమ్మా- స్వామి మన ఇలవేల్పు!. — మా తాతల తండ్రుల కాలం నుండీ స్వాములవారిని సేవించటం సాంప్రదాయం. ...

సుశీల: [చేతిలో వస్తువులు స్వామి దగ్గరగా నేలమీద వుంచి మారు మాట్లాడకుండా గిరుక్కున వెనక్కు తిరిగి ఇంట్లో కెడుతుంది.]

శాస్త్రి: (వెడుతున్న కోడలి కేసి చూస్తూ) సుశీలా ఏమిటా నిర్లక్ష్యం? — కృష్ణ కృష్ణ! — చూశారుగా స్వామి కోడలు పిల్ల తల బిరుసుతనం. ...

స్వామి: శివోహం...చిన్నపిల్ల గదా...(చిరునవ్వు నవ్వేడు.)

శాస్త్రి: కాదు స్వామి చదువుకున్నాను గదానే అహం భావం!. — రాను రానూ ... ఈ తరం ఆడపిల్లల్లో

అణకువ పెద్దలపట్ల గౌరవం బొత్తిగా కరువౌతోంది.
— స్వామీ రాక రాక వచ్చారు. ... నా కోరిక
మన్నించి మా ఇంట్లో కొద్దిరోజులు వుండవలసిందిగా
నా ప్రార్థన!.

స్వామి: శివోహం! — అంతా దైవేచ్ఛ!!. — నా వలన
నీ కేలాంటి ఇబ్బందీ వుండదు కదా?! —

శాస్త్రి: ఎంతమాట? — మీరు నాఇంటవుంటే...కొండంత
అండగా భావిస్తాను!. — మేడమీది గది ఖాళీగానే
వుంది. మీరక్కడ నిరభ్యంతరంగా వుండచ్చు! —
మీ దైవధ్యానానికి అంతరాయమే కలగదు.

స్వామి: నా కొరకు ప్రత్యేకమైన ఏర్పాట్లేమీ చేయద్దు.
వేళకి ఓ గ్లాసెడు ఆవుపాలు ... రెండు అరటిపళ్ళు
వుంటేచాలు!. అదేనా ఆహారం. ...

శాస్త్రి: అలాగే ... (అనేసి పళ్ళెంలో స్వామి పాదాలు
వుంచి నీటితో కడిగి నెత్తిన చల్లుకుంటాడు.)

స్వామి: మనో వాంఛా ఫల శిద్ధిరస్తు!. ...

శాస్త్రి: ప్రస్తుతం నాకున్న దిగులల్లా వక్కటే స్వామీ. ...

స్వామి: ఏమిటది? —

శాస్త్రి: నా రెండో వాడికి వుద్యోగం రావటం!—తర్వాత...

స్వామి: సందేహించకు!...అన్ని కోరికలూ విన్నవించుకో...

శాస్త్రి: నా వియ్యంకుడు ... అదే నా రెండో కోడలు తండ్రి నుండి నాకు రావలసిన కట్నం తాలూకూ బాకీ వసూలు చేసుకునేటందుకు మార్గం...మీరు చూపిస్తే ... చచ్చి మీ కడుపున పుడతాను వచ్చే జన్మలో!.

స్వామి: శివోహం! ... ఓపిక పట్టు ... ఆలోచించి తర్వాత నీ కేదైనా పరిష్కారమార్గం సూచిస్తాను. (లేచి నిల్చున్నాడు.)

శాస్త్రి: కృష్ణ కృష్ణ! – చాలా సంతోషం!!...రండి స్వామీ మనం మేడమీది కెళ్ళి మాట్లాడు కుందాం. ...

(ఇద్దరూ మేడ మెట్లెక్కి పైకి వెడతారు.)

శేషయ్య: (ఒక చేతిలో సంచీతో కుంటు కుంటు ప్రవేశం వస్తూనే) సుశీలా ... అమ్మాయ్ సుశీలా ... ఇంట్లో ఎవరూ లేరా ఏం?

సుశీల: (లోపలి నుండే) ఎవరు? (ప్రవేశించి) నువ్వా మామయ్యా! ఇదేనా రావటం!? — రా!. కూర్చో!! ... (కుర్చీ చూపింది.)

శేషయ్య: అట్లా బస్సు దిగేను ... ఇదిగో ఇట్లా వచ్చాను. — నువ్వేమిటే రాను రానూ పూచిక పుల్లలా తయూరవుతున్నావ్? నెల క్రితం నిన్ను చూచి నప్పటికంటే ఎంతగానో చిక్కిపోయినట్లు అవుపిస్తున్నావ్. — అన్నట్టు ... మీ అత్తగారు ... (ఇంకా బ్రతికే

వుందా అన్న ధోరణిలో చెయ్యి పైపైకి చూపుతూ అభినయిస్తాడు.)

సుశీలః ష్!. ... (పెద్దగా మాట్లాడవద్దని సైగ చేసి వాకిలి దాకా వెళ్ళి చూచి మళ్ళీ వచ్చి స్వరం తగ్గించి) ఇంకా బ్రతికే వుంది!. — కూర్చో మామయ్యా కాఫీ తెస్తాను (అనేసి వెడుతూ స్టేజి మీదున్న చెంబు పళ్ళెం తీసు కెడుతుంది).

శేషయ్య: (కుర్చీలో కూర్చుంటాడు.)

సుశీల: (కాఫీ కప్పుతో వచ్చింది.)

శేషయ్య: (కాఫీ అందుకుని) అయితే ... మీ అత్తగారు రోగంతో మంచంలో తీసుకుంటూ ఇంకా నీచేత అడ్డ మైన చాకిరీ చేయించు కుంటోందన్నమాట!— ఇంటెడి చాకిరీ చేయించు కుంటోందన్నమాట! — ఇంటెడి చాకిరీ చెయ్యలేక నువ్వేమో చిక్కి శల్యమవుతున్నావ్ —. అది సరే ... నీ మొగుడి మహాశయుడికి వుద్యోగ మేదైనా దొరికిందా? —

సుశీల: లేదు మామయ్యా!. — ఆ క్షణం కోసమే నేనూ ఆశతో ఎదురు చూస్తున్నాను. ...

శేషయ్య: ఆ వుద్యోగ మేదో త్వరగా వస్తే బావుండు ... నీ కష్టాలన్నా తక్కువవుతయ్!. - అన్నట్టు నీ మామ గారు ఇంట్లో లేడా? — అయినా నీకు అత్త పోరు

కంటే...మామగారి సతాయింపే ఎక్కువనుకుంటాను.

— ఆయనగారేమైనా ... మనిషి మారేడా? —

(తాగిన కాఫీ కప్పు క్రింద పెట్టేడు.)

సుశీల: ష్! ...పెద్దగా మాట్లాడకు. బహుశ మేడమీద వుండి వుంటారాయన!. (మెట్లదాకా వెళ్ళి చూచి తిరిగి కుర్చీదాకా వచ్చి) మా నాన్న వచ్చి నన్ను చూచి పోవటం బొత్తిగా మానేశాడు మామయ్యా ... (బాధగా అంది.)

శేషయ్య: (ఆవేశంగ) నీ మామ రాక్షసుడు మీ నాయన్ను రానిస్తేనా? (తక్కున కుర్చీలోంచి లేచి మెట్లు దాకా వెళ్ళి చూచివస్తూ)ఎప్పుడు నిన్ను చూద్దామని వచ్చినా 'కట్నం బాకీ తెచ్చావా' అని చెండుకు తింటుంటే మీ నాయన కూడా బాధగా వుందామె?!— ఎవ్వరం రాకపోతే నువ్వెక్కడ దిగులు పడతావోని నేనొచ్చేను!.

శాస్త్రి: (మేడ మెట్లు దిగుతూ) ఎవరూ? – శేషయ్యగారా!? — ఎంతసేపైందీ వచ్చి? — సంచీతో వచ్చారేమిటీ? ... వియ్యంకుడు ఇవ్వవలసిన కట్నం తాలూకూ బాకీ మీ ద్వారా పంపేడా!? ...కృష్ణ కృష్ణ! ... మరి చెప్పారు కారేం. ... (ఆశతో దగ్గరగా వచ్చాడు.)

శేషయ్య: (చిన్న బుచ్చుకుంటూ) కోర్టుపని మీద ఈవూరొచ్చాను... ఎట్లాగూ వచ్చాను గదా...అమ్మాయి నొకసారి చూచి పోదామన్పించి. ...

శాస్త్రి: అమ్మాయిని చూచి పోదామనా ... నేనింకా బ్రతికి వున్నానో లేదో తెల్సుకు పోదామనా? — ? — నాది మొండి ఆయుర్దాయం శేషయ్యగారూ!? — వియ్యాంకుడు బాకీ తీర్చేవరకూ నిక్షేపంగా బ్రతికి వుంటానని ఆయనగారికి నొక్కి మరీ చెప్పండి! (సుశీల కేసి గుర్రుగా చూచేడు.)

సుశీల: (ఇక అక్కడే నిలబడటం మర్యాద కాదని కాఫీ కప్పు తీసుకుని ఇంట్లో కెడుతుంది.)

శేషయ్య: మరీ మీరు అంత కటువుగా వ్యవహరించటం ఏ మాత్రం బాగో లేదు శాస్త్రిగారూ. ...

శాస్త్రి: (రెచ్చిపోతూ) ఇదిగో ... నాకున్న దొక్కటే నాలుక! ... నే చెప్పేది వక్కటే మాట!! — అంత కట్నం ఇచ్చుకో లేనివాడు పెత్తందారిలా పెండ్లికి ముందు కల్లబొల్లి మాటలెందుకు చెప్పినట్టు? — మమ్మల్ని మోసంచేసే టందుక్కాదూ? —

శేషయ్య: అలా ఎన్నటికీ కాదు — మా బావకూడా సమయానికి డబ్బు చేతికి అందటం లేదు. వ్యాపారంలో తోటి భాగస్తులు ఆయనెత్తిన బురదపూసి అన్యాయం చేసేరు. మీ బాకీ ఇచ్చేస్తాడు లెండీ. ...

శాస్త్రి: ఇంకా ఎన్నాళ్ళకండీ ఇచ్చేది? ... పిల్లవాడి తల్లో వెంట్రుకలు తెల్లబడ్డాకనా ?! — నే చచ్చాకనా? — అహాఁ! ... ఎప్పుడు...ఎప్పుడు తీరుస్తాడు కట్నం బాకీ

అని!?! — అంత చేత గానప్పుడు తన తాహతుకు తగిన సంబంధంకోరకు వెతుక్కొని వుండాల్సింది. M. A. పాసైన నా కొడుకే ఎందుకు కావలసి వచ్చాడు? —

శేషయ్య: మీకు ఆడపిల్లలంటూ లేరు కాబట్టి ఇంత నిక్కచ్చిగా మాట్లాడ గలుగుతున్నారు. ...

శాస్త్రి: ఎట్లా?! — నేనే గనుక ఆడపిల్ల పెళ్ళి చేయాల్సి వస్తే ... ఓ మాట అనుకున్న తర్వాత ఇస్తామన్న కట్నం అణాపైసలతో విసిరి అవతల పారేసి వుండే వాడ్ని. తెలుసా!? — నీ బావగారు గతిలేనివాడు కాబట్టే ... బాకీ ఎక్కడ అడుగుతానోని ... మళ్ళీ ఈ ఇంటి గడప తొక్కలేదు. — సిగ్గు లేకపోతే సరి! — పైగా పౌరుషం కూడానా?—?

శేషయ్య: శాస్త్రిగారూ! — మీరు పెద్దవారు. ... మీకు చెప్ప గల అర్హత నాకు వుందో లేదో గాని ... మాటలు తూలి మాట్లాడటం ఏం సభ్యత అన్పించుకుంటుంది మీరే ఆలోచించండి ...

శాస్త్రి: అంత రోషంగలవారైతే ... ఏదీ... నా డబ్బు నా ముఖాన ఎడంచేత్తో విసిరేయమనండి? ... నేను మళ్ళీ నోరు మెదిపితే అప్పుడనండి! — అంతేగాని... నంగనాచి కబుర్లతో ఎవర్ని తృప్తిపరుద్దామని? —

ఏం? — ఆయన రాలేక రాయ బారానికి మిమ్మల్ని పంపేడా?

శేషయ్య: రాయ బారాని క్కాని ... కాళ్ళ బేరానికి కానీ నేను రాలేదు లెండి!. — పిల్ల దాన్ని చూచి పలుక రించి పోదామని వచ్చాను. అంతే! —

శాస్త్రి: చూశారుగా! — ఇంకేం? — మీరు చూచిం దేమిటో మీ బావగారికి విన్నవించుకోండి!– మాఇంటి కొచ్చిన ప్రతివాళ్ళనూ భోజనం చేసి వెళ్ళ మనటానికి నా ఇల్లేం సత్రం కాదు. (సత్వరున ఇంట్లోకి నడిచి వుత్తరీయం మీద వేసుకుని వస్తూ.) నా కవతల బోలెడు పనుందీ ... వస్తా (బైటి కెడతాడు.)

శేషయ్య: (తనూ బయల్దేర బోయాడు.)

సుశీల; (ప్రవేశించి) వెడుతున్నావా మామయ్యా...(గాద్గది కంగా).

శేషయ్య నీ మామగారు మాట్లాడిన మాటలతో కడుపు నిండిందిగా అమ్మా! — బుద్ధి గడ్డితిని... నేరకపోయి వచ్చాను. ఈ ఇంట్లో ఐదు నిముషాలున్న నాకే ఇంత బాధగా వుంటే...ప్రతిక్షణమూ అందరి చేతా సూటీ పోటీమాటలతో నువ్వెంత సుఖంగా బ్రతుకుతున్నావో అర్థమవుతోంది! — వస్తాను (వెళ్ళబోయి ఏదో గుర్తొచ్చి ఆగి) ఆఁ! – అసలు విషయం మర్చేపోయాను– నీ చిన్న చెల్లెలు పెద్ద మనిషైంది ... నీ వాళ్ళు అనుమ

తిస్తే ... ఓసారి వచ్చి చూచిపో ... వస్తా తల్లీ ...
(నిష్క్రమిస్తాడు.)

సుశీల: (భారంగా నిట్టూర్చి గిరునతిరిగి మధ్యగదిలో కెళ్ళి చీపురు తెచ్చి వూడుస్తూంటుంది.)

రవి: (చేతిలో చిన్న సూట్ కేసుతో వస్తూనే) సుశీలా! — ఓ గ్లాసెడు మంచినీళ్ళు పట్రా! ... (సూట్ కేస్ పక్క నుంచి కుర్చీలో కూర్చున్నాడు.)

సుశీల: (చీపురుతో left wing లో కెళ్ళి గ్లాసుతో గబగబా వచ్చింది) తీసుకోండి! (గ్లాసు అందించి సూట్ కేసు Middle డోర్లోకి తీసుకెళ్ళి పెట్టి మళ్ళీ వచ్చి) ఏమండీ ... మీరు వెళ్ళిన పని అయిందా ... (ఆప్యాయంగ అడిగింది.)

రవి: (గ్లాసు అందిస్తూ) అవుతుందనే ఆశకూడా లేదు. ...

సుశీల: అదేం? —

రవి: (నిరుత్సాహంగ) ఏం చెప్పను? — ఈ సారయినా ఇంట ర్వ్యూలో నెగ్గుతానని గంపెడాశతో వెళ్ళానా ... (కుర్చీలోంచి లేచి నడుస్తూ) తీరా వెళ్ళాక తెల్సింది...

సుశీల: ఏమని? — ?

రవి: పదివేలు ఇస్తేగాని ఆ వుద్యోగం మనకు రాదని ...

సుశీల: పోనీ అంతడబ్బు మన మిస్తే ... ఆ వుద్యోగం మీకొస్తుందా? (ఆశగా అడిగింది.)

రవి: (చిరాకుగా) ఏం? అంతడబ్బు నీ బాబేమైనా ఇస్తాడా?
— అయినా ఆ అవకాశమూ మించి పోయింది. ...

సుశీల: ఎందుకని? —

రవి: డబ్బుగల వాళ్ళు ఈగల్లాగ చుట్టూ మూగి డేగల్లాగ
తన్ను కెళ్ళారు ఆ ఛాన్సు కాస్తా? —



సుశీల: హుఁ: — (నిట్టూర్చింది.)

రవి: నేను అదృష్టవంతుడ్ని ఎలాగూ కాదు. — నాతోపాటు
దురదృష్ట వంతురాలివని. ఈ సారితో పూర్తిగా తేలి
పోయింది!.



సుశీల: నిరాశపడకండి!. ప్రయత్నం చేస్తే ... ఇంకో
వుద్యోగ మేదైనా దొరక్క పోతుందా. ...

రవి: (వెటకారంగ) ఆ...దొరుకుతుంది ... ఎందుకు దొర
కదూ? ఇప్పటికే మా నాన్న ప్రతిసారి డబ్బు ఇచ్చే
టందుకు కారాలు మిరియాలు నూరి లక్ష తిడుతూ
ఇస్తున్నాడా? ... మరోసారి అడిగితే ... ఉరేసుకో
మంటాడు! — ఛ ఛ! వెధవ లైఫ్



సుశీల: బాగా అలిసిపోయారు... వుండండి కాఫీ తెస్తాను...

రవి: అక్కర్లేదు. ఇంత విషం తెచ్చిపెట్టు చాలు. ...

సుశీల: అవేం మాట లండీ ...

రవి: ఏం చేయమంటావ్?— నా నరనరంలోనూ నిరుత్సాహః
నిస్పృహా జీర్ణించుకు పోయింది. — రోజు గడిచే కొద్దీ

వుద్యోగం దొరుకుతుందనే ఆశ... అవకాశం కరువవు తోంది. — మరో ఏడాది ఇలాగే గడిస్తే ... మన కసలు వుద్యోగమే రాదు — ఏజ్ బార్రై పోతుంది. — అప్పుడు ఇద్దరం కల్సి జాయింటుగా వురేసుకోవచ్చు...

సుశీల: (మారు మాట్లాడలేక నిస్సహాయంగా left wing లో కెడుతుంది )

శాస్త్రి: (బైటినుండి వస్తూనే కొడుకుని చూచి) వచ్చావా రవీ ... ఎంతసేపైందీ నువ్వొచ్చి...?

రవి: నాన్నా... నే వెళ్ళిన పని. ...

శాస్త్రి: కాలేదని నీముఖమే చెప్తోంది!. అయినా... నిన్ను M. A. చదివించటం నా బుద్ధి తక్కువ కదూ?! —పదో తరగతి పాసవగానే... ఓ కొట్లో గుమాస్తాగా పడేసి వున్నట్టయితే హాయిగా ఈ పాటికి నాలుగొందలు సంపాదిస్తూ వుండేవాడివి. ...

రవి: అది కాదు నాన్నా ...

శాస్త్రి: నాకింకేమీ చెప్పకు!. ఎవడి క్కావాలిరా నీ బోడి M.A.? — ఆఖరికి అడుక్కుతినేవాడి క్కూడా ఈ రోజుల్లో డిగ్రీవుంది. ...

రవి: నన్ను మాత్రం ఏం చేయమంటావు నాన్నా ... నా ప్రయత్నం నేను చేస్తునే వున్నానుగా ...

శాస్త్రి: ప్రతిసారీ నాలుగేసి వందలతో నన్ను తడివరం

చేస్తూనే వున్నావు! — ఒరేయ్ ... ఇంటర్వ్యూ కెళ్ళి రావటం కాదురా కావలసింది (నిట్టూర్చి) ఇంతవు నీ ముఖాన వుద్యోగం చేయగల రాత లేదేమో లే... — పోనీ ... ఓ పని చెయ్ ...

రవి: చెప్పండి నాన్నా ...

శాస్త్రి:— ఓ కాలో చెయ్యో విరగ్గొట్టుకో! — కుంటివాడివి గదానే జాలితోనైనా ఎవరైనా కనికరించి వుద్యోగం ఇస్తారేమో...?

రవి: నా...న్నా...!

శాస్త్రి: లేకపోతే ఏమిట్రా? – తాదూరకంత లేదు మెడకో డోలన్నట్టు... నేనే నీకు తిండి పెట్టలేని స్థితిలో వుంటే ...నీకు తోడు పెళ్లాం!. — పదిపైసలు పెట్టి పెళ్ళానికి పూలుకొని తీసుకురాలేని పరిస్థితి నీది! అలాంటప్పుడు పెళ్ళెందుకు చెప్పు? — ఇంటిల్లి పాదిసీ మేప లేక నా చావు కొస్తోంది.

రవి: నీకీ బాధ వద్దులే నాన్నా... నా చావేదో నేచస్తాను...

శాస్త్రి: చచ్చి ఏం సాధిస్తావ్?. బ్రతికే వుద్ధరించాలి పరిస్థితిని!!. అదీ పౌరుషమంటే ... వుద్యోగ మెట్లాగూ వచ్చేట్టు లేదు గనుక ... వ్యాపారమేదైనా చేసుకో చేతనైతే...

రవి: చేతిలో పైసాలేకుండా వ్యాపారం ఎలా చేస్తాం నాన్నా?! — ఎవరైనా వింటే నవ్విపోతారు. ...

శాస్త్రి: కృష్ణ కృష్ణ!. ఇప్పుడు నవ్వటం లేదు గనుకనా?!... మన బ్రతుకులు ఇంకా నవ్వుల పాలు కాకుండా వుండాలీ అంటే ... నీ సంపాదన నువ్వు చూచుకోవల సిందే ... ఆc!.

రవి: ఎట్లా నాన్నా?. ... పెట్టుబడి కావద్దూ? ...అంత డబ్బు ఎవరిస్తారు?

శాస్త్రి: ఇంకెవరు? — నీ మామగారు! ... నీ కాళ్ళు కడిగి పిల్లనిచ్చి కన్యాదానం చేశాడే ... వాడు!!

రవి: (మౌనం వహించేడు).

శాస్త్రి: మాట్లాడవేం? — మిగతా డబ్బు ఇవ్వడా?! — ఇచ్చేది లేదంటే... నువ్వు నోరు మూసుకునివున్నా... నేను వూరుకోను! — నీ పెళ్లాన్ని నువ్వు ఏలుకోకుండా వుంటే ... కట్నం డబ్బులొచ్చి నీ కాళ్ళ ముందు వాల్తయ్. — నువ్వేమో ... వెర్రి వెధవలాగ పెళ్లాం కొంగు పట్టుకుని పళ్ళికిలించుకుంటు తిరుగు తూన్న న్నాళ్ళూ నీ మామ మహాశయుడు చీటూరు కొమ్మమీదనే కూర్చుంటాడు.

రఘు: (ప్రవేసించి) ఎందుకు నాన్నా తమ్ముడ్ని మాటలతో వేధించటం?

శాస్త్రి: కృష్ణ కృష్ణ! — ఏమిటీ? ... నేను... వేధిస్తున్నానా?

రఘు: కాదు — అత్తగారిలా పోరు పెట్టి సాధిస్తున్నావ్. ...

శాస్త్రి: నోరు ముయ్యరా!. తమ్ముడ్ని వెనకేసుకొస్తు న్నావా? — నీకేమైనా బుద్ధివుందా! ? — జీవితంలో వాడు ఏదో విధంగా స్థిమితపడాలని నేను అనుకుంటూ వుంటే ... నా హితోపదేశాలు నీకు శాపనార్థాల్లాగా ... సాధింపులుగా అవుపిస్తున్నాయా ? — , అయితే ఇంకేం? ... మధ్య నా పెద్దరికం దేనికి ... మీ ఇష్ట మొచ్చినట్టు అఘోరించండి. ...

రవి: ఊరుకో అన్నయ్యా ... నాన్న మనసు కష్టపెట్టకు! — అయోగ్యులమైనందుకు మనల్ని మనం నిందించు కోవాలి. ...

శాస్త్రి: ఒరేయ్! — నేను బ్రతికి వున్నాళ్ళేరా మీ ముఖం చూచేది ఎవరైనా? — ఆ తర్వాత చెట్టుకో పుట్టయి పోతారు. (స్వామి మేడ దిగిరావటంచూచి) చూశారా స్వామీ ... నా ఇద్దరు కొడుకులూ అప్రయోజకులు అనటమే కాకుండా ... వేళకింత తిండిపెడుతున్న కన్నతండ్రినే నిందించే స్థితి కొచ్చేరు. ...

స్వామి: శివోహం! — కలికాలం శాస్త్రీ! — కాకుంటే... కన్నబిడ్డలే తండ్రిని నిందిస్తారా ?

రఘు: మన్నించండి స్వామీ ... మా తొందరపాటుకు మన్నించండి!! —

శాస్త్రి: (రవి నుద్దేశించి) ఆడపిల్లలా తలొంచుకు నిలుచుంటా వేం?. ఇంట్లో కెళ్ళి స్నానం చేసి బట్టలు మార్చుకో...

రవి: (మవునంగ మిడిల్ డోర్లో కెడతాడు.)

సుశీల: (left door లోంచి వచ్చి) మామగారూ!. మీకు బావగారికీ భోజనం ఏర్పాటు చెయ్య మంటారా?...

శాస్త్రి: ఇంకా ఆలస్యం దేనికి? ... పేగులు మాడిపో తున్నయ్ ... వేళ మించిపోయింది కూడాను!! ... మా భోజనంతో బాటు స్వామివారికి అల్పాహార మేదైనా చేశానా మరి ...

సుశీల: వారికి మినపరొట్టెలు తయారు చేశాను.

స్వామి: నాకోసం శ్రమ పడకండి!.

రఘు: మా ఇంటికొచ్చి మీరు పస్తులుండాల్సిన అవసరం ఏమాత్రం లేదు స్వామీ. ...

శాస్త్రి: మాతోపాటు మీరు!... సుశీలా! – నువ్వు వెంటనే భోజనం వడ్డించెయ్ ... మేమూ వచ్చేస్తున్నాం...

సుశీల: అలాగే ... (left door లో కెళ్ళిపోయింది.)

శాస్త్రి: మరి ... నీ మొగుడు మాటేమిటి. ... వాడిప్పుడు భోజనం అందరితో పాటు చెయ్యడా? —

సుశీల: ఆయన తర్వాత భోజనం చేస్తారట...(వెళ్ళిపోయింది)

శాస్త్రి: రఘూ! ... నువ్వు భావిదగ్గర కెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కో... నేనూ వచ్చేస్తున్నాను.

రఘు: అలాగే (left door లో కెడతాడు.)

శాస్త్రి: స్వామీ ... మీరు సిద్ధమేకదా? ! —

స్వామి: ఆహా!. నా జపంకూడా పూర్తి చేసుకున్నాను.

శాస్త్రి: నా సంసారం సంగతి మీకు పూర్తిగ అర్థమైవుంటుంది ఈ పాటికి! ... నా పరిస్థితి అంతా అయోమయంగా తయారైంది స్వామీ.

స్వామి: (సీరియస్‌గా విలన్‌లాగ శూన్యంలోకి చూపునిలిపి) శివోహం! — పరిష్కార మార్గంకోసం అన్వేషిస్తున్నాను. ... నువ్వేమీ దిగులుపడకు. — సమయం ఆసన్నమైనపుడు నేను వుపదేశిస్తాను. — అధైర్య పడకు.

శాస్త్రి: నాకిక మీరే దిక్కు!!

స్వామి: నీ రెండో కుమారుడు గురించేగా? ... ఇంటి పరిస్థితి చక్కబడాలంటే ... (చెప్పబోయి ఆగి) అహం ... ఇప్పుడు కాదు...మళ్ళీ ఆలోచించి నిర్ణయిస్తాను. ...

సుశీల: (left door దగ్గరగా నిలబడి) వడ్డించాను ... రండి! (మళ్ళీ లోనికెళ్ళింది.)

శాస్త్రి: రండి స్వామీ ... రండి!!.

[ఇద్దరూ left door లో కెడతారు. ఓ నిముషం తర్వాత రవి చొక్కాగుండీలు పెట్టుకుంటూ Middle door లోంచి వస్తాడు బైటికెళ్ళే ప్రయత్నంలో.]

రవి: (M. D. లోంచి వచ్చి exit అనబోతూ ఎదురుపడ్డ మామగారిని చూచి ఆగి వెనక్కొచ్చేడు.)

రాఘవయ్య: (ప్రవేశిస్తూ) బాబూ కులాసాగా వున్నావా!?—

రవి: మామగారా! ...దారితప్పి వచ్చి నట్టుంది (నిష్టురంగ.)

రాఘు: నువ్వే మనుకున్నా ...ఎందరు ఎన్ని రకాలుగా నన్నూ నా పరిస్థితినీ అపార్థం చేసుకున్నా ... పిల్ల నిచ్చుకున్న తర్వాత రాక తప్పుతుందా అల్లుడూ!. ?—?

రవి: అ ..ల్లు...డు! — అల్లుడు ఇన్నాళ్ళకు గుర్తొచ్చాడన్న మాట మీకు ! (కటువుగ మాట్లాడేడు).

రాఘు: అనుకున్నదొకటి. ...జరిగింది మరొకటి! విధి వక్రించ టంతో నా వ్యాపారం తల్లక్రిందులైంది ... పరిస్థితి తారుమారు అయింది అల్లుడూ! ... నీకు సరైన జవాబు ఎలా చెప్పట మాని ఆలోచిస్తూ ముఖం చాటే య్యాల్సి వచ్చింది. — అమ్మాయి సుశీల క్షేమంగా వుందా రవీ?!—

రవి: (కసితో) ఆహా! — ఇంకా బ్రతికే వుంది. ...

రాఘు: అదేం మాటయ్యా?! — పది కాలాల పాటు మీరు క్షేమంగా వుండటం కంటే నేను కోరుకునేది మాత్రం వేరేముంటుంది? — నా పరిస్థి తెలావున్నా . నేనేమై పోయినా ఫర్వాలేదు...కాని...నా చిట్టితల్లి సుశీలను మాత్రం కంట తడిపెట్ట నివ్వకు ! — అదే నేను కోరుకునేది. ...

రవి: అన్ని మాటలూ మీరే అంటూంటే ఇక నే చెప్పే దేముంది? మేము సుఖంగా వుండాలనుకుంటున్న

వారైతే... మా పెళ్ళయి ఆరునెలలు కావస్తుంటే...
ఓ ఆడపిల్లను కన్నతండ్రిగా మా యోగక్షేమాలు
విచారించకుండా ఎలావుండగలుగుతున్నారండీ మీరు?

రాఘు: ఏం చెయ్యాను చెప్పు!?— నేను ఎదుటపడి మీ మన
స్సును మరింత గాయపరిచే కంటే ... మీ కళ్ళకు
అవుపించకుండా వుండటమే మంచి దన్పిస్తోంది. —
మీ మధ్యకు వచ్చేటందుకు నాకు ముఖం చెల్లటం లేదు
బాబూ ... ముఖం చెల్లటం లేదు. ...

రవి: పాతపాటే పాడి ఎన్నాళ్ళని మా నోరు మూయిస్తారు?
మే మిక్కడ ఎన్ని అగచాట్లు పడుతున్నామో మీకు
తెలీదు. చెప్పినా మీకు అర్థంకాదు. — ఓ వేళ అర్థ
మైనా... మీ రేం ఆర్చేవారా? — తీర్చేవారా? —
నాకా వుద్యోగంలేదు. వస్తుందనే ఆశకూడా నాలో
నశించిపోయింది. — ఎన్నాళ్ళని తండ్రి దయా దాక్షి
ణ్యాల మీద బ్రతకటం? ... మీరైనా కట్నం
తాలూకూ డబ్బు ఇస్తారేమో అనుకుంటే ... శుష్క
వాగ్దానాలు శూన్యహస్తాలు తప్ప మీదగ్గర మాత్రం
ఏముంది?!

రాఘు: నీ బాకీ తీర్చేస్తాను బాబూ. ... తప్పకుండా తీర్చే
స్తాను. కాకుంటే... నాకు మరి కొన్నాళ్ళు వ్యవధి
కావాలి ...

రవి: మీరు ఇస్తారనే ఆశతో ఎదురుచూస్తూ కూర్చుంటే...

ఈ లోగా నా పళ్ళూడి పోయి జుట్టు నెరిసి పోతుంది - మీ రేమైనా అనుకోండి. ... కానీ, — కట్నం డబ్బు మాత్రం వెంటనే మీరు ఇచ్చే ఏర్పాటు చెయ్యండి. ఆ డబ్బుతో నేను ఏదైనా వ్యాపారం చేసుకు బ్రతుకు తాను. ...

రాఘు: నే నివ్వవలసిన డబ్బు ఇవ్వకపోతే ... నువ్వు బ్రతక లేవా బాబూ ... ?

రవి: మామగారూ! — హద్దుమీరి మాట్లాడుతున్నారు. నాలో కోపాన్ని బుసకొట్టించకండి. — అంత చేత గానప్పుడు మీ శక్తికి మించిన వాగ్దానాలు ఎందుకండీ చేసింది? — అవసరం తీరిందనేగా మీరు మీ చిత్తం వచ్చినట్లు మాట్లాడు తున్నారు.

శాస్త్రి: (బ్రేవ్ మని త్రేన్చుతూవచ్చి) ఎవరూ ...? — రాఘువయ్యా! ? — ఏమిటిలా వచ్చావ్? (కొడుకుతో వెటకారంగా) పాపం... భోజనం వేళయినట్టుంది... లోపలికి తీసుకెళ్ళి ఇంత అన్నం పెట్టించరా నీ మామ గారికి. ...

రాఘు: మనిషి బిక్క చచ్చిపోయి) మీ దయవల్ల తిండికి గతి లేనంత అధోగతిలో లేను లెండి. ...

శాస్త్రి: అలాగా పాపం!. — కృష్ణ కృష్ణ! — మరైతే ఎందు కొచ్చినట్టు? ... ఆహాఁ! ... అర్థమైంది! — రండి ... రండి ... రండి ... (కొడుకుతో) ఒరేయ్!

పాపం కట్నం తాలూకు డబ్బు కష్టపడి మోసు కొచ్చి
నట్టున్నాడు. (మళ్ళీ ఇటు తిరిగి) ఇలా రండి... ఇలా
రండి. ... కుర్చీలో కూర్చుని ముందు అలుపు తీర్చు
కోండి. తర్వాత తీరు బడిగా మాట్లాడుదురు గాని ...
(వేళా కోళంగా.)

రాఘు: (గాద్గదికంగా) బావగారూ. ...

శాస్త్రి: సిగ్గులేక రోషంకూడా నా మనిషికి! ? — పిల్లనైతే
కన్నావ్ ... అల్లుడినైతే తేరగా తెచ్చుకున్నావ్...
ఇవ్వావలసిన కట్నం బాకీ మాత్రం గుర్తుండదేం?? —

సుశీల: (వచ్చి తండ్రిని చూచి సంబరపడి పోతూ) ఎంత
సేపైంది నాన్నా నువ్వొచ్చి ?. అమ్మ కులాసాగా
వుందా? ... చెల్లెళ్ళు బావున్నారా?? ... (గడగడా
మాట్లాడింది.)

శాస్త్రి: దేశంలో అందరూ కులాసాగానే వున్నారు మనింట్లో
మనం తప్ప! — మీ నాయనొచ్చాడు ... మూట
తెచ్చాడేమో అడుగు!! —

సుశీల: (పరిస్థితి అర్థమైంది. తెప్పరిల్లుకుని)నువ్వెందు కొచ్చావు
నాన్నా ఈ ఇంటికి? .. వెళ్ళిపో నాన్నా .. వెళ్ళిపో...
(దుఃఖం పెల్లుబికింది.)

రవి: సుశీలా! — కళ్ళనీళ్ళు చూచి కరిగిపోయే వాళ్ళెవ్వరూ
లేరుగాని ... ముందు నువ్వింట్లో కెళ్ళు ... వూఁ! —
(గద్దించేడు.)

సుశీల. వెళ్ళ మనద్దండీ. ...నన్ను లోపలికి వెళ్ళ మనద్దండీ...
(బావురు మంది.)

రవి: (రివ్వున వచ్చి చెంప ఛెళ్ళు మన్పించి) లోపలికి వెడతావా లేదా? —

రాఘు: బాబూ రవీ!. ... ఆగవయ్యా! ... అది ఏం తప్పు చేసిందని చెయ్యి చేసుకున్నావు రవీ ! — నీకు అంత కోపంగా వుంటే ... నన్ను కొట్టు ... కొట్టి నీ కసి తీర్చుకో. ...

సుశీల: (గుడ్ల నీరు కుక్కుకుని నిస్సహాయంగా left door కి వెళ్ళిపోయింది.)

రవి: (అందరి కేసీ చూచి) ఛీ! ... పాపిష్టి మనుష్యులు ...
(Middle డోర్లో కెడతాడు.)

స్వామి: (left door లోంచి వస్తూ) శివోహం! ఎందుకొచ్చింది గాలివాన? —

శాస్త్రి: గాలివాన కాదు స్వామీ ... పెనుతుఫాను! — (రాఘువయ్య కేసి తిరిగి ఆవేశంగా) వాడి పెళ్లాన్ని వాడు కొట్టుకుంటాడు చంపుకుంటాడు మీ కెందు కండీ బావగారు ... ?

రాఘు: (నిస్సహాయత పౌరుషం మిళితమై) పిల్ల నిచ్చుకుంది చంపుకోవటాని క్కాదండీ ... పదికాలాల పాటూ పచ్చగా కళకళ లాడుతూ కాపురం చేసుకోవటానికి.

శాస్త్రి: కృష్ణ కృష్ణ! — ఇన్ని నీతులు చెప్పగలిగిన మీకు... కట్నం బాకీ తీరుద్దామని మాత్రం అన్పించదు! — మీ అమ్మాయి మాత్రం సుఖపడాలని కోరుకుంటారు! — మాకు మాత్రం మీరు నామం పెట్టాలి!! — ఏం ? —

స్వామి: ఆవేశం వలదు శాస్త్రీ. ... నిదానించు ! ! —

రాఘు: మీ బాకీ తీర్చాలి — నిజమే!! —కాదనను...కానీ... నా పరిస్థితు లే అనుకూలించటం లేదు. ... అంత మాత్రాన నా కళ్ళ ఎదుటే ... నా కూతుర్ని ... సమయం సందర్భం లేకుండా కొడతారా? ...మానసికంగా దాన్ని హింసిస్తారా? ... ఇది అమానుషం కాదుటండీ...? — మీకూ ఒక ఆడపిల్ల వున్నట్టయితే అర్థమయ్యేది ఆడ పిల్లను కన్న తండ్రి పడే క్షోభ ఏమిటో ?! —

శాస్త్రి: అబ్బో!...మీరు కాంగా కన్నారు ఆ...డ...పి... ల్ల...ను!. లోకంలో ఇంకెవరికైనా వున్నారా ఆడ పిల్లలు?. అంత అబ్బురంగా కనిపించిన వాడివైతే కట్నం డబ్బు కుడిచేత్తో విసిరి పారేయచ్చుగా ...

రాఘు: (నిభాయించుకుని) ఓడలు బండ్లు ... బండ్లు ఓడలూ అవుతయ్ బావగారూ ...

శాస్త్రి: ఏం బావగారూ ... శపిస్తున్నారా? —

స్వామి: శివోహం! — ఆవేశాలు మాని ... సమస్యకు పరి

ప్కార మార్గం ఆలోచించటం అందరికీ శ్రేయోదా
యకం. ... ఏమంటారు!! —

రాఘు: మీరైనా చెప్పండి స్వామీ!? — నేను అసమర్థుడనే
... కానీ...నా పిల్లను చెండుకు తినటం ఏం భావ్యం?,

శాస్త్రి: మీరు వెయ్యి చెప్పండి... లక్ష చెప్పండి! — మీ
కూతురు నా కొడుకుతో సుఖంగా కాపురం చేయాలీ
అంటే ... కృష్ణ కృష్ణ! ... కట్నం తాలూకూ డబ్బు
నా చేతిలో పడాల్సిందే!? — రాదేమో అనుకున్న
మీరు వచ్చారు గదా! ... నే చెప్ప దల్చుకున్న ఆఖరి
మాట కూడా చెప్పేశాను. — ఇక మీరు దయ
చేయచ్చు. ...

రాఘు: అంతేనంటారా ... అంతేనా స్వామీ ... (గుడ్ల
నీరు నింపుకుని గాద్గదికంగ)...నా దొక్కటే మనవి! —
నా గురించి నా బిడ్డ భవిష్యత్ చీకటి చేయకండి ...
చీకటి చేయకండి! ... దాని బ్రతుకులో నిప్పులు
పొయ్యద్దని వేడుకుంటున్నాను ... (చేతులెత్తి దణ్ణం
పెట్టి వెనక్కు వెనక్కు అడుగులేస్తూ exit అవుతాడు).

స్వామి: శివోహం. ...

రవి: (మధ్య డోర్లోంచి వేగంగా వచ్చి బైటి కెళ్ళబోతూం
టాడు.)

శాస్త్రి: ఎక్కడికిరా నీ పరుగు? — వెళ్ళిపోయిన నీ మామగారి
వెంటబడి ఆయన కాళ్ళమీద పడటానికా...?

రవి: (తక్కున ఆగి పొంగివచ్చే కోపాన్ని అణచుకుంటూ నిస్సహాయంగ) కాదు ... వురేసుకోవటానికి ...

శాస్త్రి: మగాడివి! ... పరిస్థితికి భయపడి వురేసుకోవలసిన ఖర్మ నీకేం పట్టిందిరా ?!. ఆ పని ... అటు నీ మామ గారో ఇటు నీ పెళ్ళామో చెయ్యాలి గాని! ...

రవి: (రోషంగ) నా...న్నా !

శాస్త్రి: పెద్దవాడ్ని ! — పైగా నీ తండ్రిని !! — అనవసర మైన ఆవేశానికి పోకుండా ... నా మాట విను ! — నే చెప్పినట్టు చెయ్ !! — అప్పుడు నీకు అంతా మేలే జరుగుతుంది !. — ఏమంటారు స్వామీ.

స్వామి: శివోహం ... వున్నమాట చెప్పేరు. — మరి ... నేను పైకి వెళ్ళి కాస్సేపు విశ్రాంతి తీసుకుంటాను... (మెట్లెక్కి వెడతాడు.)

రవి: (జుట్టు పీక్కుంటూ) నా కేమీ తోచటంలేదు. — నన్నిప్పుడేం చేయమంటావు నాన్నా ?

శాస్త్రి: వాజమ్మలాగ పెళ్ళాన్ని నెక్కించుకోగానే సరిపోదురా!? — పదిపైసలు పెట్టి పెళ్ళానికి పూలు కొనిపెట్ట లేవని తెల్సి అసలు పెళ్ళెందుకు చేసుకున్నట్టు? — ఆఁ!. మీ అందరికి తిండి పెట్టేటందుకు నేనున్నానవేగా?! — అవునా! ? — నా పరిస్థితి చూడబోతేనూ అంతంత మాత్రంగానే వుంది. నీ మామగారు చూడబోతే

మొండి చెయ్యి చూపిస్తున్నాడు. నీ పెళ్లామేమో బెల్లం కొట్టిన రాయిలా నోరు మెదపదు.

రవి: అందుకని...?

శాస్త్రి: అందుకనీ... నే చెప్పేదేమిటంటే ... జాగ్రత్తగా విను... నీ భార్యను నీ వెంట తీసుకుని వెళ్ళి నీదో లేదో నువ్వే చూచుకో! ...

రఘు: (మధ్య జోక్యం చేసుకుంటూ) అర్ధాంతరంగ బైటికి వెళ్ళి పొమ్మంటే ఎట్లా నాన్నా...?

శాస్త్రి: తమ్ముడి మీద అంత ప్రేమ కారిపోతున్న వాడివైతే ... నువ్వూ వాడితో పాటే బైటికి నడు! ... నడు నాయనా?! —

రఘు: (నిశ్చేష్టుడై) నా...న్నా...!

శాస్త్రి: అవునా! ... మీకై మీరు స్వతంత్రంగా బ్రతకటం నేర్చుకోండి. — ఎక్కడికైనా వెళ్ళి లక్షణంగా వుండండి!!. — అట్లా కాదనుకుంటే ... చెప్పు క్రింద తేలులాగ నేను చెప్పినట్టు నడుచుకోండి — అర్థమైందా?! —

రఘు: తమ్ముడూ... విన్నావుగా నాన్న నిర్ణయం! ... మన కాళ్ళమీద మనం నిలబడ లేనప్పుడు ... కనీసం కన్న తండ్రి మాటైనా వినాల్సిన ధర్మం మనమీద వుంది. — ఏమంటావ్ ... ?

రవి: అసలు తప్పంతా నాదే!. తొందరపడి పెళ్ళి చేసుకుని సమస్యలను సృష్టించుకున్నాను.

శాస్త్రి: పెళ్ళి చేసుకోవటంలో తప్పు లేదురా పిచ్చిసన్యాసీ! — కాకపోతే ... నీమామ మహానుభావుడున్నాడు చూశాన్ ... అతగాడు మనల్ని మసిపూసి మారేడు కాయచేసి ... తన పబ్బం గడుపుకున్నాడు. — మనల్ని అందర్నీ వాజమ్మల్ని చేశాడు!. — కట్నం కోసమని మనం గంగిరెద్దుల్లాగ తలకాయలు వూపేం. – చివరికి మన వేలితో మన కళ్ళనే పొడిచేడు నీమామ! — అతడు చేసిన నయవంచనకు ప్రతీకారం చేసి చూపాల్సిందే ... ఏమంటావ్?.

రఘు: చిన్నవాడు...వాడేమంటాడు నాన్నా? — మీకెట్లా చేస్తే బావుంటుందనుకుంటే ... అట్లా చెయ్యండి! — ఏరా రవీ ... అంతేనా!?! —

రవి: మీ ఇష్టం నాన్నా. ...

శాస్త్రి: (గర్వంగా ఇద్దరికేసి చూచి) ఆఁ! ... ఇప్పుడు మీ ఇద్దరూ నా కొడుకులన్పించారు! — ఇక చూపిస్తా నా తఢాకా ఏమిటో? ... (శూన్యంలోకి చూస్తూ) ఇల్లు అలకగానే పండగ కాదు రాఘువయ్యా. ... పిల్ల పెళ్ళిచేసి నా ఇంటికి పంపించగానే సరిపోలేదు. ... నా దెబ్బ ఏమిటో రుచి చూపించనిదే నిద్రపోను (తమాయించుకుని) ఒరే రఘూ ఇంట్లోకెళ్ళి నా వుత్త

రీయం తీసుకురా ... నేనట్లా వీధిలో కెళ్ళాల్సిన పనుంది ...

రఘు: (Middle door లో కెళ్ళి వుత్తరీయం తెస్తాడు.)

శాస్త్రి: రఘూ! — నువ్వూ నా వెంట రా!! —

(శాస్త్రి, రఘు exit అవుతారు.)

రవి: (దిక్కుతోచక అక్కడున్న కుర్చీలో కూలబడతాడు).

సుశీల: (left door లోంచి వస్తూ) ఏమండీ ... వేళమించి పోయింది. ... భోజనానికి రారూ?!! — ...

రవి: (సీరియస్‌గా భార్య ముఖంలోకి చూచి చివాలున కుర్చీ లోంచి లేచి నడుస్తూ) హు! ...

సుశీల: (భర్తను సమీపిస్తూ) ఉద్యోగం రానందుకు సత్యాగ్రహం చేస్తున్నారా...?

రవి: కాదు! — నిన్ను పెళ్ళి చేసుకున్నందుకు సంబరపడి పోతున్నాను ... అందుకే ఆకలన్పించటంలేదు...

సుశీల: అవేం మాటలండీ ...

రవి: (కోపాన్ని చంపుకుంటూ) సుశీలా ... మనం బ్రతకటం అవసర మంటావా ...

సుశీల: సమస్యలన్నింటికీ... కారణం నేనేకదూ?... (బేలగా అంది).

రవి: అంతే కాదు సుశీలా ... క్షణక్షణానికీ తెలీని బలహీన తేదో నన్ను బలీయుంగా లొంగ తీసుకుంటోంది.

ఏ నిముషంలో ఏం జరుగుతుందో వూహించ లేకుండా వున్నాను.

సుశీల: ఏమండీ! ... ఇన్ని సమస్యల మధ్య మన మీ ఇంట్లో వుండక పోతేనేం?...హాయిగా మనిద్దరం ఎక్కడికైనా వెళ్లిపోదాం ...

రవి: వెళ్ళిపోదామా?!. ఎక్కడికి? — ఎలా?? —

సుశీల: భీరువుగా మాట్లాడతారేం? — ఈ విశాలవిశ్వంలో మనిద్దరం బ్రతికేటందుకు మార్గమే వుండదంటారా?!—

రవి: వట్టి చేతులతో మనిద్దరం నడిరోడ్ల మీద నిలబడాల్సి వస్తుంది సుశీలా! ...నో!. నేను బికారి బ్రతుకు బ్రతకలేను. — అయినా నీ కారణంగ ఈ ఇల్లు వదలి నేనెందుకు బైటికెళ్లాలి? ...

సుశీల: ఏమండీ! – ఆడదాన్ని...కనీ పెంచిన తల్లీతండ్రిని ... తోబుట్టువులను వదలి ముక్కూ ముఖం తెలీని మీతో కాపురం చేయటానికి వంటరిగా నేను మీ ఇంట్లో అడుగు పెట్టలేదూ?! – మగవారై వుండి ... M. A. పాసై ...బైటికెడితే బ్రతకలేమనుకోవటం అవివేకం..

రవి: నేను పిరికివాడినే సుశీలా! — కానీ ... నీ ఒక్కదాని గురించి నేనెందుకు మావాళ్ళందరికీ దూరమవాలనేది నా ప్రశ్న ?

సుశీల: హుం! — మీ ప్రశ్నకు జవాబు లేదు. — మీతో వాదించాలని కాదుగాని ... రాను రాను ఇంటి పరి

స్థితులు విషమిస్తున్నాయేమోనని భయంగా వుంది. — మరికొన్నాళ్లు మనం ఇక్కడే వుంటే ఏం జరుగుతుందో వూహించలేం ...

రవి: జరగాల్సిందేదో జరక్కమానదు! — అందుకని ...

సుశీల: అయ్యో... మీకెలా తెలీ చెప్పాలా అర్థం కావటం లేదు. ...

రవి: నువ్వేమీ చెప్పనక్కర్లేదు — నే చెప్పేది విను. వెళ్ళి మీ నాన్న నడిగి డబ్బు పట్టుకురా!—అప్పుడు హాయిగా దర్జాగా స్వతంత్రంగా జీవిద్దాం!!

సుశీల: డబ్బు ... డబ్బు—డబ్బు...!!! — డబ్బే ప్రధానం గాని మనకు ఆత్మాభిమానం అక్కర్లే దంటారు,.. ?

రవి: హుఁ! — ఆత్మ...అభిమానం!! ఎక్కడున్నయ్ సుశీలా? నాకంటికి కన్పించవేం ? ? — అవి కేవలం అర్థం లేని మాటలు? — ఇప్పుడు మాత్రం మనల్ని ఎవరు గౌర విస్తున్నా రని ..?

సుశీల: డబ్బు ఇవ్వగలిగే స్థితిలో మా నాన్నే వుంటే . మనకు ఇన్ని సమస్యా లెందుకు ఎదురౌతాయండీ! — ఏమండీ! మిమ్మల్ని వేడుకుంటాను. ... మన జీవితాలను మీరు కూడా డబ్బుతో ముడివేయకండి. ...

రవి: సుశీలా! ... రాను రానూ నాలో మనుష్యులమీద కసి కచ్ఛ పెరిగిపోతోంది — నా ముఖంలోకి సూటిగా చూచి చెప్పు! — మీ నాన్న నన్ను వంచించాడా ? లేదా ? ? —

సుశీల: (అవాక్కయి గుడ్ల నీరు కుక్కుకుంది.)

రవి: మాట్లాడవేం సుశీలా. ...

సుశీల ఏం మాట్లాడను? ...ఏమని మాట్లాడను ... (గాద్గదికంగ.)

రవి: నువ్వేం మాట్లాడతావులే! — ఆ తండ్రి కన్నబిడ్డవి కదూ?! — మీ నాన్న ఈ విధంగా చేస్తాడని వూహించి వుంటే...ఎందుకులే!?...మాటలే మిగిలి పోతయ్. — వెళ్ళు సుశీలా ... నా ఎదుట నిలబడి నా ఆవేశాన్ని ఆలోచన్లను రెచ్చగొట్టకు ... వెళ్ళు ... (అంటూ తనే బైటికి వడివడిగా నడుస్తాడు.)

సుశీల: [నిర్విణ్ణురాలై చూస్తూండి పోయింది.]

స్వామి: శివోహం! ... ఏమిటి... భార్యాభర్తలు దేని గురించో ఘర్షణ పడుతున్నట్టుంది? (మేడదిగి వస్తూ అంటాడు.)

సుశీల: (ఏం చెప్పాలో తోచక మౌనం వహిస్తుంది.)

స్వామి: దగ్గరగా వచ్చి భుజంమీద చెయ్యివేసి) ఇంత చిన్న వయస్సులో నీకెన్ని కష్టాలు?...

సుశీల: (నిశ్చేష్టురాలై దూరంగా జరిగింది.)

స్వామి: నీ చల్లని చేత్తో ఓ గ్లాసెడు మంచి నీళ్ళు ఇవ్వు సుశీలా ...

సుశీల: (రివ్వున ఇంట్లో కెడుతుంది.)

స్వామి: (తనలో తాను నవ్వుకుని ... శూన్యంలోకి చూస్తూ)
శివోహం! అంతా దైవేచ్ఛ ...

సుశీల: (నీళ్ళ గ్లాసుతో ప్రవేశం)

స్వామి: ఇంట్లో ఎవ్వరూ లేరా ... (అంటూ సుశీల చెయ్యి పట్టుకుంటాడు.)

సుశీల: (బెదిరిపోయి ధైర్యాన్నికూడ దీసుకుని) ఛీ! ...ఇలాంటి వాడి వనుకోలేదు. ...మీరంతా కపట నాటక మన్నమాట ... (చెంప ఛెళ్ళు మన్పించింది.

స్వామి: (తాచులా బుసకొట్టి) చిన్న దానివని సహించాను. — చూడూ! ... నీ భర్త ఓ చవట దద్దమ్మ! — అలాంటి వాడితో నువ్వేం బ్రతగ్గలవ్? — నా మాట విని... నాతోరా! ఇద్దరం కల్సి హాయిగా ఏ హిమాలయాలకో వెళ్ళి పోదాం... (మీాది మీాది కొస్తాడు.)

సుశీల: ఛీ!. తిన్న ఇంటి వాసాలు లెక్కించే దౌర్భాగ్యుడా ... మా వారిని రానీ ... నీ అంతు తేలుస్తాను. ...

స్వామి: శివోహం! —అంతా నీ భ్రమ!— ఎం చేత అంటావా ... నామాట నీ మామగారు కాదనడు!. నీ మామ గారి మాట నీ భర్త కాదనడు!! — ఇక ఈ ఇంట్లో నీ మొర ఆలకించే దెవరు?. నీ మాట విని నమ్మే దెవరు?? — అందుకే... నా మాట విని నే చెప్పినట్టుచెయ్ ... ఏం! ? —

సుశీల: గీచుడా! ... నీ అంతు నేనే చూస్తాను ... (ఉగ్రు రాలౌతుంది.)

స్వామి: పొరబడుతున్నావ్... నువ్వు ఆడదానివి ...అశక్తు రాలవు. ... ఈ విషయం నీ భర్తకు తెలిస్తే నీ పరువే పోతుంది. ఆడదాని జీవితం అరటాకు లాంటిదని మర్చిపోయి ప్రవర్తించకు. ...

సుశీల: (కోపాన్ని నిభాయించుకుని) .. ఛీ ... (గిరున వెనక్కు తిరిగి left door లో కెడుతుంది.)

శాస్త్రి: (వస్తూనే నేలకేసి చూస్తూ) కృష్ణ కృష్ణ! ... మంచి నీళ్ళ గ్లాసు నేలమీద పడిపోయిం దేమిటీ ?

స్వామి: (తెప్పరిల్లుకుని) శివోహం! — ఆc! ... ఏముంది ... నీ కొడుకు కోడలు ఘర్షణపడ్డారు ... ఆ కోపంలో నీళ్ళగ్లాసు విసిరి నేలకేసి కొట్టేడు నీ పుత్రరత్నం! — అతనలా వెళ్ళాడు ... నువ్విలా వచ్చావ్ ... — ఇంతకూ నువ్వెళ్ళిన పని ఏమైంది...?

శాస్త్రి: ఊళ్ళో ఎందరిని అడిగినా ముష్టి అచ్చొందలు అప్పు పుట్టటం ఘనమైంది. ... వెనకటి రోజుల్లో అయితే... గడపలో కూర్చుని కబురుపెడితే చాలు. ... ఇంటికి తీసుకొచ్చి ఇచ్చి వెళ్ళేవారు! — ఇప్పుడో?... కృష్ణ కృష్ణ! ... కాళ్ళూ గడ్డం పట్టుకు బ్రతిమాలినా 'ఛీ - ఛీ' అనటమే కాకుండా వడ్డీ నూటికి పదిస్తావా పదిహే నిస్తావా అంటున్నారు. ... కాలమే మారిపోయింది.

స్వామి: శివోహం! — ఈ రోజుల్లో మనిషికి విలువెక్కడుంది? — చివరికి మమకారాలు ... ప్రేమలూ ... బంధు ప్రీతి అంతా డబ్బుతోనే ముడిపడ్డయ్. 'ధన మూలం ఇదం జగత్' అని పెద్దలేనాడో అన్నమాట ఈ రోజుల్లో అక్షరాలా నిజమై కూర్చుంది.

శాస్త్రి? మహా బాగా శలవిచ్చారు.

స్వామి: నీ రెండో కొడుకు సంపాదన పరుడు కాలేదనీ ... అతనికి వుద్యోగం రాలేదనే గానీ బాధంతా. ...

శాస్త్రి: అవును స్వామి ...

స్వామి: నీ పెద్దకుమారుడు చాలినంత సంపాదించటం లేదనే గానీ అసంతృప్తి. ...

శాస్త్రి: అంతే కదా స్వామి ...

స్వామి: నీ వియ్యంకుడు కట్నం బాకీ తీర్చలేదనే గానీ ఆవేదన ...

శాస్త్రి: నిజం చెప్పేరు!!.

స్వామి: చూశావా!?—నీలో ఎన్ని రకాల ఆలోచనలు డబ్బుతో పడివున్నాయో?! ...అంతా నీ తాపత్రయమే గాని... నీ ఆలోచన్లకు ఓ చక్కని రూపాన్నిచ్చి ఆచరణలోకి తెచ్చుకో లేక పోతున్నావ్... అవునా?! —

శాస్త్రి: ఏం చేయను స్వామీ ? ... అప్పటికే ... అటు నా కొడుకు ... ఇటు నేనూ ... కట్నం తేనందుకు

కోడల్ని రాచి రంపాన పెడుతూనే వున్నానూ. ...
అయినా ఫలితం లేకుండా పోతోంది ...

స్వామిః అందుకని = చేతగాని వాడిలా చేతులు ముడుచు కూర్చుంటావా? ...

శాస్త్రిః అప్పటికీ... వియ్యంకుడిని కూడా ఎన్నెన్ని మాట లన్నానో...! ఎంత కించ పరిచానా? - అయినా అత గాడు చలించడు. ...

స్వామి: నువ్వు ఇన్ని ప్రయత్నాలు చేసినా డబ్బు నీ చేతి కొచ్చే మార్గం అవుపించటం లేదు ... కదూ?!?

శాస్త్రి: (తల వూపేడు.)

స్వామిః నీ సమస్యకు పరిష్కారం డబ్బే నంటావ్?-అవునా!?-

శాస్త్రి: అంతేగా స్వామీ. ... 'డబ్బే' ... నా వూపిరి ... డబ్బుకోసం ఏ పని చేయమన్నా చేసేస్తాను...

స్వామి: (సీరియస్ గా విలన్‌లా శూన్యంలోకి చూచి) అందుకు నేనొక చక్కని పథకం ఆలోచించి వుంచాను. ...

శాస్త్రి: అదేమిటో చెప్పండి స్వామీ...చచ్చి వచ్చే జన్మలో మీ కడుపున పుడతాను ....

స్వామి: (ప్రతీకార వాంఛ చూపులో నిలిపి) నా వుపదేశాన్ని నీవు అక్షరాలా ఆచరించాలి... అలా చేయగలిగితేనే ఉపదేశిస్తాను. ఆలోచించుకో! —

శాస్త్రి: కృష్ణ కృష్ణ!. – స్వామీ ... మీరే నాకు గురువు

దైవం అన్నీనూ! — నన్ను శంకించకండి. ...

స్వామి: అయితే ... ఇలా రా.

శాస్త్రి: (స్వామి దగ్గరగా వచ్చాడు.)

స్వామి: (శాస్త్రి చెవిలో ఏదో చెప్తాడు.) ఏం అర్థమైందా?—

శాస్త్రి: (వికటంగా నవ్వి) నా ఆలోచనకూడా అదే స్వామీ...

స్వామి: శివోహం! — అయితే ఇంకేం ... ఇక మన నిర్ణయానికి ఓ రూపం ఇవ్వటం నీ మీదే ఆధారపడివుంది! ...మరి...నేను మేడమీది కెళ్ళి ధ్యానంలో నిమగ్నుడనౌతాను. ... (మేడ మెట్లెక్కి వెడతాడు.)

శాస్త్రి: (నేలమీద పడి వున్న గ్లాసు చేతిలోకి తీసుకుని left door లో కెళ్ళి పెట్టి వస్తాడు.)

రఘు: (రఘు ప్రవేశం.)

శాస్త్రి: రఘూ! సమయానికొచ్చావ్. — నీతో ఓ విషయం మాట్లాడాలి.

రఘు: మన ఇంటి విషయమా...?

శాస్త్రి: అదే...నీ తమ్ముడి విషయం!. మన ఇంటికి పట్టిన శని విరగడై వాడు సుఖపడాలీ అంటే...మన మంతా ఏకమై పని పూర్తి చేయక తప్పదు!! —

రఘు: ఏమిటి నాన్నా అది?—

శాస్త్రి: ఏముందీ!?! ... మీ తమ్ముడికి రెండో పెళ్ళి చేద్దామనుకుంటున్నాను. ...

రఘు: అదెలా సాధ్యం నాన్నా?... సుశీల వప్పుకోవద్దూ? —

శాస్త్రి: ష్! .. గట్టిగా మాట్లాడకు (దగ్గరగా వచ్చి చెవిలో రహస్యం చెప్పేడు) ... రవిని కూడా వప్పిద్దాం! — ఏమంటావ్ ? —

రఘు: (సంశ ఇస్తూ) నా కెందుకో భయంగా వుంది నాన్నా...

శాస్త్రి: భయమనుకుంటే ఎట్లా ? — మనుష్యులు కాదురా ముఖ్యం. — డబ్బు శాశ్వతం! — మరి ... మనకు డబ్బు కావాలీ అంటే అట్లా చేయక తప్పదు. ...

రఘు: నూరేళ్ళాయుష్షు! — రవి కూడా మాటల్లోనే వచ్చే శాడు! ... (రవిని చూచి) ఏరా...అలా వున్నావేం ?

రవి: మనస్సేమీ బాగో లేదు ...

శాస్త్రి: ఎలా బావుంటుందీ? ... ఇంత చిన్నవయస్సులో వాడి మనసునిండా దిగులే నాయె. ... (రవిని సమీపించి బుజ్జగింపుగా) ఒరే అబ్బీ! ... నీ సమస్యకు పరిష్కార మార్గం ఆలోచించేనురా ...

రవి: (నిర్వేదంగ) ఏమిటి నాన్నా అది...

శాస్త్రి: తండ్రిగా... నా మీదగాని ... నా మాటమీదగాని గౌరవముంది కదా?!

రవి: నీ మాట ఎప్పుడు కాదన్నానని!? (పేలవంగ)

శాస్త్రి: అలా అంటే కాదు. ... నే చెప్పినట్టు 'త – చ' తప్పకుండా చేస్తానని నా చేతిలో చెయ్యివేసి ప్రమాణం చెయ్యాలి. ...

రఘు: నాన్నమాట కాదనకు తమ్ముడూ!... మన శ్రేయస్సు కోరేవాడు నాన్న! ...

శాస్త్రి: నేను చెప్పినట్టు చేస్తే...నీకు వుజ్వలమైన భవిష్యత్ వుంటుంది. (చెయ్యి ముందుకు చాచేడు.)

రవి: (అచేతనంగ తండ్రి చేతిలో చెయ్యి వేశాడు.)

రఘు: (వారిద్దరి చేతుల మీద తన చేయి వుంచాడు రఘు.)

శాస్త్రి: (తన్మయత్వంతో) మీ ఇద్దరూ నా రెండు కళ్ళలాంటి వాళ్ళు. మీ మీదేరా నా ఆశలన్నీ! ... రవీ ... నవ్వు ఏ విధమైన దిగులూ లేకుండా నవ్వు యీ కళకళ లాడుతూ వుండాలంటే .. నువ్వు బాగు పడాలీ అంటే ... నీ భార్యని మర్చిపోవాలి ... అంతే!

రవి: (షాక్ తిని) ఆఁ! ...

రఘు: అవును రవీ! — వెరీ సింపుల్... ఈ విషయం గురించి నాన్న ఒక నిర్ణయాని కొచ్చాడు

శాస్త్రి: చూడు రవీ! — మనం ఏం చెయ్యబోతున్నా మనేది నీ భార్యను ముందుగా పసిగట్ట నివ్వకూడదు. — గుట్టు చప్పుడుగా అంతా క్షణాలమీద జరిగిపోవాలి. ... ఈ ఇంటి శని ... మన పీడ ... విరగడై పోతుంది. (చెవిలో రహస్యం చెప్పేడు.)

రవి: (తల అడ్డంగా ఆడిస్తూ) వద్దు నాన్నా... వద్దు.. అలా చేయటం పాపం నాన్నా ... (అంటూ వెళ్ళి కుర్చీలో నిస్సహాయంగా కూర్చుండి పోతాడు.)

శాస్త్రి: (కుర్చీ సమీపిస్తూ) కన్న తండ్రిని! — నీ క్షేమం కోరే వాణ్ని ... నేను కావాలో ... అది కావాలో బాగా ఆలోచించుకో ...

రఘు: (రెండో వేపు కుర్చీ పక్కగా వచ్చి నిలబడి) క్షణం క్రితం నాన్నకు మాటిచ్చావ్ తమ్ముడూ ... చేతిలో చెయ్యి కూడా వేసి ప్రమాణం చేశావ్. ...

శాస్త్రి: రవీ...మనకు అంతకు మించి మరో మార్గం లేదు...

రఘు: కాదనకు రవీ! ... ఆలస్యంచేస్తే మన ప్లాను విఫల మౌతుంది ...

శాస్త్రి: డబ్బు కన్నా విలువైనది ఈ ప్రపంచంలో వేరేదీ లేదురా పిచ్చిసన్యాసీ! ...అందుకే నా మాట విను...

రఘు: తమ్ముడూ! నీ సుఖం కోరేరా నాన్న ఈ విధమైన నిర్ణయాని కొచ్చింది. ...

శాస్త్రి: ఈ నాడు మనదగ్గర డబ్బులేదు— రాని డబ్బుకోసం చింతిస్తూ కూర్చునేకంటే ... మరో విధంగా డబ్బు సంపాదించ గల మార్గం వెతుక్కోవటం ... కార్య సాధకుల లక్షణం రవీ! —

[శాస్త్రి, రఘూ చెరొక పక్కన చేరి ఎడా పెడా మాట్లాడేసరికి రవి పిచ్చివాడే అయ్యేడు. — ఒక నిర్ణయాని కొచ్చిన వాడిలా కుర్చీలోంచి లేచేడు.)

రవి: (నడుస్తూ) అలాగే నాన్నా... అలాగే ...

శాస్త్రి
రఘు } (ఇద్దరి ముఖాల్లో సంతోషం పురి విప్పింది.)

స్వామి: (మేడ మెట్లు దిగుతూ) శివోహం! ... కథ మాంఛి రసపట్టులో వున్నట్టుం దే ...

శాస్త్రి: వీళ్ళు నా బిడ్డలు స్వామి ... (గర్వంగా) నా మాట కెదురు చెప్పరని ముం దే చెప్పేనుగా మీకు. ...

స్వామి: శ్భభాష్ !. నీలో ఆవేశాన్ని చల్లార నీకు రవీ ... రఘూ ! నువ్విలారా ... (చెవిలో ఏదో చెప్పేడు.)

రఘు: అలాగే ... (left door లో కెడతాడు.)

స్వామి: శాస్త్రి ... (దగ్గరగా వచ్చి చెవిలో ఏదో చెప్పి) నువ్వు ఆ పని చెయ్...

శాస్త్రి: అవశ్యం! ... (తనూ left door లో కెడతాడు.)

స్వామి: శివోహం!. రవి కుమారా ... నూతన జీవిత ప్రారంభానికి నువ్వు స్వాగతం పలుకబోతున్నావ్. ...అంటే నీ పాత జీవితం మనందరి పాదాల క్రింద శాశ్వతంగా సమాధి కాబడబోతోంది! — (భుజం తట్టి) నువ్వేం భయపడకు! ... ఊఁ! ... త్వరగా నీ భార్యని పిలు ... ఆలస్యం చెయ్యకు ... (స్వామి గబగబా మేడ మీది కెడతాడు.)

రవి: సుశీలా ...సుశీలా... (గావు కేక పెట్టేడు.)

సుశీల: (వస్తూనే) ... ఏమిటండీ అలా వున్నారు. ...

రవి: నేనెలా వుంటే నీకేం?... నువ్వీ ఇంట్లో సుఖంగా వున్నావుగా!? ... మేమంతా అర్థం కాని సమస్యలతో సతమత మౌతూంటే ... నీకు చీమైనా కుట్టినట్టులేదు-కదూ? (ఆవేశంగా మీది మీది కెడతాడు.)

సుశీల: (బెదిరిపోతూ) ఏమండీ ... !

రవి: ఒక్క మాటలో చెప్పాలీ అంటే ... నువ్వీ ఇంటికి పట్టిన 'శని' వి ...

సుశీల: (వెనక్కి నడుస్తూ) ఏమండీ ... మీకేమైనా మతి పోయిందా ...

రవి: అవును!. నన్ని ఇంట్లో పిచ్చివాణ్ణి చేసి ఆడిస్తున్నారంతా ... సమస్యలన్నింటికీ నువ్వే కారణం ... మేమంతా సుఖపడాలీ అంటే... నువ్వు బ్రతక్కూడదు ...నువ్వు చచ్చిపోతే...కాదు... నిన్ను చంపితే ,... (మీది మీది కొస్తూ గొంతు పట్టుకోబోయాడు.)

రఘు: (చేతిలో తాడుతో ప్రవేశించి మెల్లగా ప్రవేశ ద్వారం వద్ద కొచ్చి నిలబడతాడు.)

సుశీల: (వెనక్కు నడుస్తూ) ఏమండీ ... నన్ను చంపద్దండీ... నేను మీకేం అపకారం చేశాను. ...(రఘును చూచి) బావగారూ ... మీరైనా చెప్పండీ. ...

శాస్త్రి: (చేతిలో కిరోసిన్ డబ్బాతో ప్రవేశించి left doo

(ప్రక్కగా నిలుస్తాడు.)

రఘు: నిన్ను చంపటం వాడికి చేత కాకపోతే ... నా చేతిలో వున్న తాడుతో నీ మెడకు వురి బిగించి నేనే చంపాల్సి వస్తుంది. ...

సుశీల: ఆఁ! ... (ఇంతలో మామగారి వేపు తిరిగి దగ్గఱగా వచ్చి) తండ్రిలాంటి వారు ... నన్ను చంపద్దని మీరైనా చెప్పండి మామగారూ ... నన్ను కాపాడండి. ...

శాస్త్రి: నిన్ను ఆ భగవంతుడు కూడా కాపాడలేడు. ... ఈ డబ్బాలో కిరోసిన్ నీమీద కుమ్మరించి నీకు నిప్పు అంటించి సజీవంగా దహనం చేస్తాను, ... నీ పీడ శాశ్వతంగా వదిలించు కుంటాను. ...

సుశీల: (దిగ్భ్రాంతి చెంది ఏ మీతో చని స్థితిలో కంగారుగా మేడ మెట్ల వేపు పరుగు తీస్తుంది.)

స్వామి: (సుశీలను చూచి పళ్ళు కొరుకుతూ) ప్రతీకార జ్వాల నా నరనరం లోనూ పరవళ్ళు తొక్కుతోంది. (బొడ్లోంచి కత్తి తీస్తాడు.)

సుశీల: (నిర్ఘాంతపోయి నిలుస్తుంది.)

రవి: (బిగ్గరగా వెఱ్రిగా) మీ కెవ్వరికీ శ్రమ అక్కర్లేదు. నా భార్య మీద సర్వాధికారాలూ నా వక్కడికే వున్నాయ్ ... దీని అంతేదో నేనే తేలుస్తాను. ...

(స్వామి చేతిలో కత్తిని ఆవేశంతో లాక్కొని) సుశీలా...
నీ బ్రతుక్కి జనగనమణ ... నేను పాడతాను. ...
(పాడవబోయాడు.)

సుశీల: (గాభరాగా వెనక్కి తిరిగి left door లోకి పారిపో
తుంది.)

రవి: (చేతిలో కత్తితో) నీ అంతు చూస్తాను ... (భార్య
వెంట పడ్డాడు. తనూ left door లో కెళ్ళాడు.)

సుశీల: [లోపల్నించి కేకలు)...ఏమండీ...నన్ను చంపద్దు...
చంపద్దు ...

రవి: (లోపల్నించి) నిన్ను బ్రతకనివ్వను ... నువ్వు బ్రత
కక్కూడదు ...

(కెవ్వున కేక పెడ్తుంది సుశీల.)

శాస్త్రి:
రఘు:
స్వామి:
} [ఒకరి ముఖాలు మరొకరు చూచుకొని తృప్తిగా
నవ్వుకుని] పీడ విరగడైంది. ... (అంటారు ముక్త
కంఠంతో). [ఎక్కడి వారక్కడే నిలబడి
వుంటారు స్టేజి మీద.]

[ఒక్క క్షణం ఆగేక డొక్కలో కత్తితో
Middle door లోంచి నెత్తురు చిమ్మిన గుడ్డలతో
రవి ప్రవేశం.]

రవి: (వాలిపోతు...తూలి పోతూ వచ్చి అందరి కేసి చూస్తూ)
అయిపోయింది. ... అంతా తల్లక్రిందులైంది. ...
(డొక్కలో కత్తి లాగేసుకుని స్టేజి మీద వాలి
పోతాడు. చలనం లేకుండా కన్ను మూస్తాడు.)

శాస్త్రి: (భోరున ఏడుస్తూ కంగారుగా కొడుకుని సమీపించి) బాబూ. ...

రఘు: (ఆదుర్దాతో సమీపించి) తమ్ముడూ ... రవీ. ...

స్వామి: [మెట్లమీదే వుంటాడు కంగు తిన్నవాడి లాగ.]

[స్టేజిమీద అంతవరకూ వున్న పూర్తి లైటింగ్ ఆరిపోతుంది. Middle drop తక్కువ వాలుతుంది. మళ్ళీ పాతస్థలంలో బోను ప్రత్యక్షమౌతుంది. ఆ బోను వెనకగా సుశీల నిలబడి వుంటుంది. నిలబడ్డ సుశీల మీద 'స్పాట్' light ఫోకస్ చేయబడి వుంటుంది. — మిగతా లైట్లేమీ వుండ నక్కర్లేదు.]

సుశీల: (వెక్కి వెక్కి ఏడుస్తూ ఆవేదనతో) ఏ తల్లి కన్న బిడ్డనో యువరానర్!... కట్టుకున్న భర్తతో ఆనందంగ, హాయిగా నూరేళ్ళు కాపురం చేయాలని కలలు కన్నాను. ... డబ్బే జీవిత లక్ష్యంగా భావించిన మనుష్యులే నా మీద కక్ష బూని కత్తికట్టేరు. ... నన్ను కాంక్షించిన దొంగ స్వామి. ... నా తండ్రి కట్నం ఇవ్వనందుకు పగబట్టిన మామగారు...పరాయి ఇంటి ఆడపిల్లననే గౌరవమే లేని బావగారు...అంతా ఏకమై ... నామీద కత్తి కట్టేరు ... నన్ను అంతం చేయాలని చూశారు. నన్ను చంపటమే లక్ష్యంగా పెట్టుకున్నారు — అనురాగాన్ని పంచిపెట్టి ప్రేమించ వలసిన భర్తే ... నా చావు కోరి నన్ను హత్య చేసే

టందుకు పూనుకున్నాడు యువరానర్! — అటువంటి బలీయమైన స్థితిలో ధైర్యాన్ని కూడ దీసుకుని, మృత్యు ముఖం నుండి తప్పించుకు నేటందుకు ఎదురు తిరి గేను. ఏ కత్తితో అయితే నన్ను పొడిచి రాక్షసంగా చంపాలనుకున్నాడో అదే కత్తితో నా భర్త అనబడే క్రూరుడ్ని చంపేను — నాది తప్పా యువరానర్?— కేవలం నా తండ్రి ఇస్తానన్న కట్నం ఇవ్వలేక పోయి నందుకు నన్ను చంపాలనుకోవటం న్యాయమా యువ రానర్?. ... ఏది న్యాయం ... ఎవరిది తప్పు అనేది కోర్టువారు విచారించి ... మళ్ళీ ఈ సమాజంలో కేవలం కట్నం కోసమై ఏ యువతీ బలి కాబడకుండా వుండే విధంగా తీర్పు చెప్పండి యువరానర్. ... తీర్పు చెప్పమని మనసారా వేడుకుంటున్నాను ... చివరి సారిగా కోరుకుంటున్నాను. ...

[Spot light off అవుతుంది. Front drop పడుతుంది.]

—: సమాప్తం :—

కలియుగ దైవం
నా ఇల వేలుపు
శ్రీ వేంకటేశ్వరుని
పాదాల చెంత
భక్తితో — అంకితం!!.

యస్. వివేకానంద.

# -: గమనిక :-



ఈ నాటికను ప్రదర్శించ

గోరువారు విధిగా నా లిఖిత

అనుమతి పొందవలెను.

నాటిక సర్వ హక్కులు

నాకు చెంది యున్నవి.

— యస్. వివేకానంద.